మదరాసు రేసులు
1949-50
డిశంబర్ మీటింగు
ఆదివారము 4-12-1949
"మదరాసు కప్"
ఆదివారము 11-12-1949

# ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 237 WEDNESDAY 30th NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# "మిన్ను విరిగిమీదపడినా 1951 తర్వాత ఆహారధాన్యాల దిగుమతి ఉండదు"

## నెహ్రూ అతిస్పష్ట ప్రకటన

### తలకు మించిన వ్యయాన్ని భరించలేమని హెచ్చరిక

### స్వయంసమృద్ధి సాధనయత్న ప్రాధాన్యం

న్యూఢిల్లీ, నవంబర్ 28: "తుపానులు రానీయండి, భూకంపాలు రానీయండి, ఇంకే ఇతర అవాంతరాలైనా రానీయండి, 1951 తరవాత ఆహార దిగుమతులన్నిటినీ నిలిపివేయాలని మేము చేసుకున్న నిర్ణయం ఎంతమాత్రమూ మారదని నేను స్పష్టంచేస్తున్నాను," అని భారతప్రధాని నెహ్రూ నేడిక్కడ ప్రారంభమైన అఖిల రాష్ట్ర ఆహారోద్యోగుల సమావేశంలో ఉద్ఘాటించారు.

పండిత నెహ్రూకు ముందు కేంద్ర ఆహారమంత్రి దౌలత్‌రాం ప్రసంగిస్తూ అతితీవ్రమైన అవాంతరం వస్తేనే తప్ప 1951 తరవాత ఆహార దిగుమతులేవీ ఉండవనీ, తుపాన్‌వల్ల ఈ సం॥ ఆంధ్రప్రాంతంలో 3 లక్షల టన్నుల బియ్యం నష్టమైనప్పటికీ, అస్సాంలో బియ్యంపంట చాల మిగులుగా ఉన్నందువల్ల విదేశాలనుంచి బియ్యపు దిగుమతులను పెంచవలసిన అవసరంలేదనీ అన్నారు. కొన్ని ఇబ్బందులున్నప్పటికీ స్వయంపోషకం అయి తీరాలని ఆయన హెచ్చరించారు. కేంద్ర ఆహార కమిషనర్ ఆర్. కే. పాటిల్ కూడా ఇదే విధంగా హెచ్చరించారు.

పండిత నెహ్రూ ఈ కింది విధంగా ప్రసంగించారు.

"ఏ దేశమూ తన శక్తికి మించి జీవించకూడదు. అందువల్ల 1951 డిసెంబర్ లోగా ఆహార దిగుమతులను నిలిపివేయ నిశ్చయించుకున్నాము. అప్పటికి స్వయంపోషకత్వం సాధించలేకపోతే ఇబ్బందులను అనుభవించవలసిందేకాని దిగుమతులుమాత్రం ఉండవు. కాబట్టి ఇప్పటినుంచీ క్రమక్రమంగా దిగుమతులను తగ్గించుకురావాలి.

మన వ్యవసాయం, దాని ఉత్పత్తిని గురించి మనకు నికరమైన లెక్కలు కావాలి. అవి లేనంతవరకూ మనం ఏమి చేయాలో స్పష్టంగా తెలియక బాధపడవలసివస్తుంది. ఇటీవల దేశంలో ఆహారోత్పత్తి కొంతవరకు పెంచబడ్డది. కాని ఎంత పెంచబడ్డదో మాత్రం తెలియదు. సాధ్యమైనంతవరకూ మన ఆశయాన్ని సాధించటానికి అడ్డుపడే ఆటంకాలను తొలగించుకోవాలి.

ఆహార పంటలూ, వ్యాపార పంటలూ రెండింటి అభివృద్ధికి సంఘర్షణ రాకుండా వ్యవసాయం సక్రమ పథకం ద్వారా జరగాలి. చిన్న చిన్న ముక్కలుగా ఉన్న కొద్దిపాటి పొలాలు అధికాహారోత్పత్తికి ఆటంకంగా ఉన్నవి. మనదేశంలో ఎకరానికి పండేపంట చాలా తక్కువగా ఉన్నందువల్ల మనిషికి సగటుగ చేసే ఉత్పత్తి తగ్గి, దేశంలో జనాభా మితిమీరి పోయినదన్నవాదం బయలుదేరింది. వ్యవసాయ దారుల్లోనే కాక, మిగిలిన తరగతుల్లో కూడా ఆహారంలో స్వయంపోషకత్వాన్ని సాధించాలన్న భావం పెంపొందినే మన లక్ష్యం 1950 చివరికి సాధించబడుతుంది.

# రేపో మాపో చుంకింగ్ పతనం

## జాతీయచైనా రాజధానిపై కమ్యూనిస్టుసేనల చక్రబంధం

### చెంగ్టూకు చాంగ్ కైషేక్ పలాయనం

హాంగ్ కాంగ్, నవంబరు 28: జాతీయ ప్రభుత్వ రాజధానీ నగరమైన చాంగ్ కింగ్ నుంచి నేటి రాత్రి మామూలు ప్రకారం రేడియో వార్తలు ప్రసారం కాకపోవడాన్ని బట్టి, కమ్యూనిస్టుసైన్యాల అగ్రదళాలు ఈసరికే చుంగ్ కింగ్‌ను ఆక్రమించుకొని ఉంటవని ఊహించడం అవుతున్నది.

నలువైపులా శత్రుసేనలచే పరివేష్టితమైన రాజధానీ నగరంనుండి ఈ వేళ ప్రొద్దున్నే విమానములలో హాంగ్ కాంగ్‌కు కొంతమంది ప్రయాణీకులు తప్పించుకొని వచ్చిరి. కమ్యూనిస్టుసైన్యాలు వారు బయలుదేరేసమయానికి నగరానికి 8 మైళ్ల దూరంలో ఉన్నవనీ, నగరం నేటిరాత్రికో రేపుప్రొద్దుటికో పడిపోవడం తథ్యమనీ ఈ ప్రయాణీకులు చెప్పిరి.

జనరలిస్సిమో చాంగ్ కై షేక్ ఈ వేళ ప్రొద్దునే రాజధానికి పశ్చిమోత్తరంగా 200 మైళ్ల దూరంలో ఉన్న చెంగ్టు అనే పట్టణానికి విమానంలో తప్పించుకొని పోయినాడు.

ప్రధానమంత్రి యెన్ సిషాన్, తక్కిన మంత్రులు విమానాశ్రయంలో ఉండి స్వంత విమానం రాకకోసం ఎదురు చూస్తున్నారట. వారు హాంగ్ కాంగ్‌కు

(6-వ పేజి చూడుడు)

### కమ్యూనిష్టులచే ఆస్పత్రి సివిల్ డాక్టరు హత్య

సికంద్రాబాద్, నవంబరు 28: నల్గొండజిల్లా హుజూర్‌నగర్ ప్రభుత్వ ఆస్పత్రి సివిల్ డాక్టరు, నారపరాజు రంగారావు అనే కాంగ్రెస్ సేవకుడు గతరాత్రి కమ్యూనిస్టులచే కాల్చి చంపబడినారని హైద్రాబాద్ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యాలయానికి వార్త వచ్చింది.

### ప్రముఖ కమ్యూనిష్టు హత్య

హైద్రాబాదు, నవంబరు 28: నవంబరు 3 వ తేదీ రాత్రి సాయుధ కమ్యూనిష్టులకు పోలీసు మిలిటరీకి జరిగిన సాయుధ సంఘర్షణలో గంగవరపు శ్రీనివాసరావు అనే ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు మరి నలుగురు అతని సహచరులు మరణించారు. ఖమ్మంమెట్టుకు 7 మైళ్ల దూరంలోనున్న కంచిరాలగూడెం గుట్టలమీద యీ సంఘర్షణ జరిగినట్లు తెలుస్తున్నది. గంగవరపు శ్రీనివాసరావు యిప్పటికి దాదాపు 20 హత్యలు చేశాడట.

హైద్రాబాద్ మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌధరిగారు, కంచిరాల గూడెం గుట్టలను గాలించి, కమ్యూనిస్టులను రూపు మాపిన సైనికోద్యోగులకు, సైనికులకు నేడు బహుమతు లిచ్చారు.

పై సంఘర్షణలో పాల్గొనిన ఒక బ్రిగేడియర్, ముగ్గురు పోలీసు ఆఫీసర్లకు తగిన బహుమానం యివ్వవలసిందని కేంద్ర ప్రభుత్వానికి సిఫార్సు చెయ్యబడింది. గంగవరపు శ్రీనివాసరావు, అతని సహచరులు హత్యచేయబడుటతో ఖమ్మంతాలూకా ప్రశాంతంగా ఉన్నదట.

### సంస్థాన కాంగ్రెస్ అనుబంధ సమస్య

#### స్వామి రామానందతీర్థ వివరణ

హైద్రాబాద్, నవంబరు 28: సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానందతీర్థగారు నేడు పి. టి. ఐ. విలేఖరితో ప్రసంగిస్తూ, ఇండియా హైద్రాబాదుల రాజకీయ సంబంధం యిప్పుడు నిర్ణయమైనది కాబట్టి, సంస్థాన కాంగ్రెసును, భారత జాతీయ కాంగ్రెస్ అనుబంధ సంస్థగా చేసుకోవలసిందిగా తాను త్వరలో కోరబోతున్నానని చెప్పారు. తాను యీ విషయాన్నిగురించి యిటీవల ఢిల్లీ వెళ్ళినప్పుడు భారత జాతీయకాంగ్రెస్ అధ్యక్షులు డా॥ పట్టాభిసీతారామయ్య, ప్రధాన కార్యదర్శి కళా వెంకట్రావుగార్లతో సంప్రదించినానని అంటూ, సంస్థాన కాంగ్రెస్ త్వరలోనే భారత కాంగ్రెస్ అనుబంధసంస్థ కాగలదని ఆశ వెలిబుచ్చారు.

ఇండియా గవర్నరు జనరల్ సి. రాజగోపాలాచారిగారు డిసెంబరులో హైద్రాబాద్ వచ్చినప్పుడు, సంస్థానకాంగ్రెస్ కార్యాలయాన్ని దర్శించి, కాంగ్రెస్ సేవకుల సభలో ప్రసంగించవలసిందనికోరుతూ రామానందతీర్థగారు ఆయనకు ఒక జాబు వ్రాస్తున్నారు.

### భగవత్ దయాళ్

న్యూఢిల్లీ, నవంబర్ 28: సయాంలో భారత రాయబారిగా వున్న భగవత్ దయాల్‌గారిని, అలగిప్పగారిస్థానే ఇండోనీషియాలో రాయబారిగా నియమించారు. అలగప్పగారు భారతదేశానికి తిరిగి వస్తున్నారు.

# సిక్కిం భూటాన్లతో భారతదేశ సంబంధాలు

## పార్లమెంట్లో ప్రశ్న: నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, నవంబరు 28: ప్రధానిపండిత నెహ్రూగారు భారతశాసనసభలో ఒక ప్రశ్నకు వ్రాతపూర్వకముగా సమాధానమొసంగుచు భూటాన్ సిక్కిములతో భారతదేశ సంబంధములను ఈ క్రిందరీతిగా నిర్వచించిరి:

"సిక్కిము చాలాకాలమునుండి భారత సంస్థానముగా పరిగణింప బడుచుండెను. ఐనను దాని నైసర్గిక స్థితి ననుసరించి ప్రత్యేక ప్రతిపత్తి యొసంగబడెను. 1817 సం॥మునుండి భారతదేశమునకు సిక్కిముతో రాజకీయ సంబంధములున్నవి. 1947 సం॥ము ఆగస్టులో అధికార దత్తత జరుగువరకు 1861 సం॥పు సంధి ఈ సంబంధములను నిర్వచించుచుండెను. అధికార దత్తత తరువాత ఈ సంబంధములను ఒక యథాతథపు ఒడంబడిక నిర్వచించుచున్నది. ఈ ఒడంబడికద్వారా క్రొత్త సంధి జరుగువరకు పాతయేర్పాట్లు అములులోనుండును. సిక్కిము-భారతదేశముల భవిష్యత్ సంబంధము లెట్టివిగా నుండునా యింకను తేలలేదు. ఈ విషయము ప్రభుత్వమువారి విచారణలో నున్నది.

భూటాను సంస్థానము ఈతరగతిలోనికి రాదు. 1949 సం॥ ఆగస్టు 8 తేదీన భూటాను భారతదేశముల మధ్య ఒక క్రొత్త సంధిపై సంతకములు జరిగెను. ఈ సంధికి పూర్వము ఉభయ దేశముల సంబంధములను 1865 సం॥పు సించులా సంధియు, దానికి సవరణగా 1910 సం॥న జరిగిన సంధియు నిర్వచించుచుండెను. ఈ సంధులు బ్రిటిష్ ప్రభుత్వము భూటాన్ ప్రభుత్వము మధ్య జరిగెను. క్రొత్త సంధి ననుసరించి విదేశాంగ వ్యవహారములపై అధికారమును భూటాను ప్రభుత్వము భారత ప్రభుత్వానికి దఖలు పరిచెరి. భూటాన్ అంతరంగిక వ్యవహారములలో భారతదేశము జోక్యము కలిగించుకొనుటలేదు.

### ఫ్రెంచిఇండియా జనవాక్యనిర్ధారణ వాయిదా

న్యూఢిల్లీ, నవంబర్ 28: ఫ్రెంచి ప్రాంతాల ప్రజాభిప్రాయ స్వీకరణ కార్యక్రమాన్ని వాయిదా వేయటానికి నిర్ణయించామని ఫ్రెంచిప్రభుత్వం ఈ వేళ భారతప్రభుత్వానికి తెలియజేసింది.

ఈ కార్యక్రమ నిర్వహణకు కావలసిన యంత్రాంగాన్ని డిశంబర్ 11 వ తేదీ లోగా యేర్పాటుచేయటం సాధ్యంకాదని తెలియజేశారు.

స్వల్పకాలం వాయిదా వేయటానికి తమకేమీ అభ్యంతరంలేదని భారతప్రభుత్వం లోగడ తెలియజేసింది.

### లేక్‌సక్సెస్‌కు షేక్ అబ్దుల్లా ప్రయాణం?

జమ్మూ, నవంబర్ 28: కాశ్మీర్ ప్రధానీ, నేషనల్ కాన్ఫరెన్స్ అధ్యక్షుడూ అయిన షేక్ అబ్దుల్లా, భద్రతామండలి కాశ్మీర్ సమస్యను చర్చించేటప్పుడు తాను తప్పనిసరిగా అక్కడ ఉండాలని నేడిక్కడ నేషనల్ కాన్ఫరెన్స్ కార్యవర్గ సమావేశంలో వెల్లడించినట్లు తెలుస్తున్నది.

కార్యవర్గం కాన్ఫరెన్స్ నియమావళిని సంస్కరించటానికి, ముగ్గురు సభ్యులతో ఒక కమిటీని నియమించింది.

### భారతదేశపు డాలర్ ఆర్జన

న్యూఢిల్లీ, నవంబరు 28: 1949 ఏప్రియల్‌నుంచి, సెప్టెంబర్‌వరకూ డాలర్ ప్రాంతాలకు జరిగిన ఎగుమతులనుగురించి శాసనసభలో ఈ దిగువ వివరాలు తెలియజేశారు.

నారసరుకులు రు. 1,795 లక్షల రూపాయిలు; సుగంధద్రవ్యాలు 166 లక్షలు; అభ్రకం 126 లక్షలు; లక్క 110 లక్షలు; చర్మాలు 15 లక్షలు; పూలుసరుకులు 80 లక్షలు; తుక్కు ప్రత్తి 25 లక్షలు, ముడి ప్రత్తి 38 లక్షలు; ముడిజనుం 11 లక్షలు; ఇతరవస్తువులు 881 లక్షలు.

అమెరికాకు, కనడాకు ఎగుమతిచేసినటీ 358 లక్షల రూపాయిలు. డాలర్ ప్రాంతంలోని ఇతరదేశాలకు చేయబడిన ఎగుమతుల వివరాలు లభించలేదు.

### 1950 మార్చిలో హైద్రాబాదు ఎన్నికలు

#### పార్లమెంటులో సర్దార్ పటేల్ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 29: నేడు అధినివేశ శాసనసభలో సేఠ్ గోవిందదాస్‌గారి ప్రశ్నకు లిఖితపూర్వక సమాధానం అందజేస్తూ సంస్థాన శాఖామంత్రి సర్దార్ పటేల్‌గారు, హైద్రాబాదు రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలకు ఓటర్ల జాబితాలు తయారైనవనీ 1950 మార్చిలో ఎన్నికలు జరపడానికి ఏర్పాట్లు కొనసాగుతున్నవనీ తెలియజేశారు. హైద్రాబాదు సంస్థానం యథాస్థితికి వచ్చిందనికూడా అన్నారు. వివిధ సంస్థానాలలో కూడా ఎన్నికలకు ఓటర్ల జాబితాలు తయారవుతున్నవని కూడా వివరించారు.

# ప్రభుత్వ వ్యయాల పొదుపు: ఉద్యోగుల తగ్గింపు

## ఆర్థికమంత్రి మత్తయి ప్రకటన

న్యూఢిల్లీ, నవంబర్ 29:— నేడు భారత పార్లమెంటులో ప్రభుత్వ పొదుపు విధానాన్ని గురించీ, ఉద్యోగులను తొలగించే విషయంమీదనూ చర్చ జరిగినది.

ప్రభుత్వ వ్యయాల తగ్గింపు విషయమై ఆర్. కె. సిధ్వాగారు వేసిన సప్లిమెంటరీ ప్రశ్నకు ఆర్థికమంత్రి డా॥ మత్తయ్ సమాధానమిస్తూ ఈ కింది అంశాలను వెల్లడించారు:—

1949 జనవరినుంచి అక్టోబర్ వరకూ ఖర్చులో ఎంత తగ్గించబడ్డదో వివరాలు పరిశీలించనిదే ఇవ్వలేము. ఉద్యోగులను పనిలోనుండి తీసివేయటం వల్ల ఎంత ఖర్చు తగ్గిందీ చెప్పట కూడా కష్టమే. పొదుపు పథకాల కింద 1949-50 వ సం॥పు ఖర్చులలో 40 కోట్లనూ, 1950-51 సం॥లో 80 కోట్లనూ తగ్గించాలని ఆలోచిస్తున్నాము. పొదుపు సిఫార్సు సంఘం సిఫార్సుల వల్ల మొదటి సం॥లో 3½ కోట్ల రూపాయలు ఆదా కావచ్చును.

#### సిబ్బంది తగ్గింపు

సర్దార్ హుకుంసింగ్: ఉద్యోగులను పనిలోనుంచి తొలగించి సిబ్బందిని తగ్గించే సందర్భంలో ప్రభుత్వవిధానం ఏమిటి?

డా॥ మత్తయ్: పెద్ద యెత్తున సిబ్బందిని తొలగిస్తే రాజకీయ, సాంఘిక దుస్థితులు రాగలవు కనుక పెద్ద యెత్తున తగ్గించకుండానే సాధ్యమైనంతగా పొదుపు చేయటమన్నది ప్రభుత్వ విధానం. సిబ్బందిని పెద్ద ఎత్తులో తగ్గించవచ్చునా లేదా అన్నది ప్రభుత్వ ఆర్థిక స్థితిమీదకూడా ఆధారపడి ఉన్నది.

ఎం. తిరుమలరావ్: ఇండియాలో పెద్ద ఉద్యోగాలు చాల ఎక్కువగా వున్న

(4 వ పేజీ తరువాయి)

# మలాన్ ప్రభుత్వ ధిక్కార చర్య

## నైరృతి ఆఫ్రికాపై సమితి ధర్మకర్తృత్వానికి ప్రాతికూల్యం

### ధర్మకర్తృత్వ సంఘ చర్చల బహిష్కారం

ప్రెటోరియా, నవంబరు 28: నైరృతి ఆఫ్రికాను ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వంకింద వుంచడం ఎప్పుడూ జరుగదని దక్షిణ ఆఫ్రికా ప్రధాని డా॥ మలాన్ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ అన్నారు.

ఆ ప్రాంతాన్ని తీసుకువచ్చి సమితి ధర్మకర్తృత్వం క్రింద వుంచమనడం ఒక దేశంయొక్క అంతరంగిక వ్యవహారాలలో చేయిచేసికున్నట్లే అవుతున్నది. అటువంటిదాన్ని మేము ఎప్పుడూ సహించం అనికూడా డా॥ మలాన్ హెచ్చరించారు.

నైరృతి ఆఫ్రికా విషయంలో రెవరెండ్ స్కాట్ చెప్పినదాన్ని వినడానికి ధర్మకర్తృత్వ సంఘం అంగీకరించడాన్ని విమర్శిస్తూ, స్కాట్ వట్టి పంచాయితీదారుడు. అటువంటివానిమాటలు వినడానికి ఈ సంఘం ఆమోదించినందుకు చెప్పాలి. ఇవ్వాళ్ల దక్షిణ ఆఫ్రికా అయింది. రేపు ఇదేగతి ఇంకో దేశానికి పడుతుంది అని అన్నారు.

ఇప్పుడు నైరృతి ఆఫ్రికా విషయంలో యేమేమి చేస్తున్నది తమకు తెలియజెప్పా

(6-వ పేజీ చూడుడు)

### ధర్మకర్తృత్వ సంఘ బహిష్కారం

లేక్‌సక్సెస్, నవంబరు 28: సమితి ఈ సమావేశంలో ఇకతాను ధర్మకర్తృత్వ సంఘసమావేశాలకు హాజరు కానని దక్షిణ ఆఫ్రికా నేడు ప్రకటించింది.

# కమ్యూనిస్టు ప్రమాద నిర్మూలనంలో గ్రీక్ ప్రజల ధైర్యసాహసాలు:

## ప్రెసిడెంటు ట్రూమన్ ప్రశంస

వాషింగ్టన్, నవంబరు 28: అమెరికన్ సైనిక సహాయాన్ని ఊతగాగొని గ్రీసుప్రజలు అఖండ ధైర్యసాహసాలతో సాగించిన పోరాటం ఫలితంగా, గ్రీసులో ఇప్పుడు కమ్యూనిస్టు గొరిల్లాలవలని ప్రమాదం ఇంచుమించు పూర్తిగా నిర్మూలమై పోయిందని, అధ్యక్షుడు ట్రూమన్ ఈవేళ కాంగ్రెసుకు ఒక నివేదికలో వెల్లడించెను.

గ్రీసు, టర్కీలకు అమెరికా వల్ల జరుగుతున్న సైనిక సహాయ కార్యక్రమం గురించి అధ్యక్షుడు ట్రూమన్ కాంగ్రెసుకు మధ్య మధ్య నివేదికలు సమర్పిస్తుండడం ఆచారంగా వస్తున్నది. ఈవిధంగా ట్రూమన్ కాంగ్రెసుకు అందజేసిన నివేదికలలో నేటిది ఎనిమిదవది.

ట్రూమన్ తన నివేదికలో ఈ విధంగా వ్రాసెను:— గ్రీసులో పరిస్థితి రవంత బాగు పడ్డదికదా అని కర్తవ్యం పూర్తి అయినట్లు భావించి అమెరికన్ ప్రజలుగాని గ్రీసు ప్రజలుగాని ఏమరి ఉండకూడదు. కమ్యూనిస్టు శక్తుల విజృంభణ, మొండి ధైర్యంలాగా ఒకసారి అంటుకుంటే చెలరేగ పడిలేస్తున్నది. నిత్యజాగరూకత, నిరంతరమైన పట్టుదల ఉంటేనే ఈ వ్యాధిని నిర్మూలించడం సాధ్యం అవుతుంది. గ్రీసు ప్రజలలో స్వతస్సిద్ధంగా కమ్యూనిస్టులను నిరోధించాలన్న మనోనిశ్చయమే గనక లేకపోయినట్లయితే, ఏదేశ సైనిక సహాయంగాని, అంతర్జాతీయ సహకారంగాని వ్యర్థమైన నిష్ఫ్రయోజనంగా పరిణమించే పడంలో సందేహంలేదు. మధ్యధరాసముద్రతీరంవరకు కమ్యూనిస్టులు ఈ వరకే దైర్యయాత్ర సాగించి ఉండేవారు గ్రీసులో కమ్యూనిస్టుల పరాజయం ప్రజా

(5 వ పేజీ చూడుడు)

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర శు దశమి

**1949 సం॥ నవం॥ 30 బుధవారం**

బు॥ దశమి ప 9-18 ఉ భా ప 1-46 వర్జ్యం రా 3-21 ల 5-9 కు.

**శు॥ ఏకాదశి డిసెం॥ 1 గురువారం**

సు॥ ఏకాదశిప12-4 లేక సా4-56వర్జ్యంలేదు.

**ఆంధ్రపత్రిక**

విరోధి సం॥ మార్గశిర శు॥ దశమి

బుధవారం

## ఆంధ్రరాష్ట్రం: మంత్రివర్గ వైఖరి

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సంబంధించిన సూత్ర సిద్ధాంతములను వివరించుచు కేంద్రప్రభుత్వ మంపిన లేఖ తమకు చేరినదని తెలుపుచు రాష్ట్రప్రధాని పూసపాటి కుమారస్వామి రాజాగారు 1950 జనవరి 26-వ తేదీనాటికి ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సాధ్యపడదని ప్రకటించిరి. కనుక కేంద్ర ప్రభుత్వ సూచనలను అమలు చేయుటలో ఈ రాష్ట్రప్రభుత్వము సావధానముగ, తన వీలునుబట్టి వ్యవహరించునని భావింపవలసి యున్నది. రాష్ట్రనిర్మాణము శీఘ్రముగ జరుగవలెనని మాత్రమే ఆంధ్రులు కోరుచుండిరి. తొందరపాటు హానికరమని వారు గ్రహించిరి. అయితే నివార్యమైన కాలహరణముమాత్రము కూడదని ఆంధ్రులు యావన్మంది, కేంద్రప్రభుత్వము వాంఛించుచున్నట్లు స్పష్టమైనది.

ఒక్క రాష్ట్రమంత్రి వర్గమే ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయమున విశేష శ్రద్ధాసక్తులను చూపుట లేదు. కేంద్రప్రభుత్వము ఆంధ్రరాష్ట్ర స్థాపనకు గడువు నిర్ణయింపకపోయి యుండవచ్చును గాని, ప్రత్యేకాంధ్ర రాష్ట్రస్థాపనకు తాము చేసిన సూచనలను సాధ్యమైనంత శీఘ్రముగ అమలు జరుపవలెనని ఆదేశించి యున్నందున జనవరి 26-వ తేదీన ప్రత్యేకాంధ్రరాష్ట్ర అవతరణకు వీలుగ ప్రాతిపదిక చర్యలు పూర్తికావలెనని భారతప్రభుత్వము అభిప్రాయపడుచున్నదని గ్రహింపవలసియుండును. ప్రత్యేక రాష్ట్రము ఏర్పడుట ఎప్పుడు జరిగినను 1935-వ సంవత్సరము భారత ప్రభుత్వ చట్టములోని 290 సెక్షను ప్రకారము రాష్ట్ర నిర్మాణచర్యలు గైకొనవలసియున్నందున నూత్న రాజ్యాంగము అమలు జరుగుటకు పూర్వమే ఇందుకు సంబంధించిన ఉత్తరువులు జారీ కావలసి యుండును. రెండు సంవత్సరముల క్రితము భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ భాషారాష్ట్ర నిర్మాణ విషయమై ఒక ప్రకటన చేయుచు నూత్న రాజ్యాంగమునందలి రాష్ట్రములజాబితాలో ఆంధ్రను పేర్కొనవచ్చునని వెల్లడించిరి. రాజ్యాంగరచనా సంఘ అధ్యక్షుడు డాక్టర్ అంబేద్కర్ "నూత్న రాజ్యాంగామోదము లోపున రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను పేర్కొనవలెనన్న తీర్మానము 1935-వ సంవత్సరము భారతప్రభుత్వ చట్టమునందలి 290 సెక్షన్‌ను అనుసరించి ఏర్పాటు కావలెను" అని రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షునికి రాజ్యాంగమునా యిదాను పంపుతూ ఫిబ్రవరి 21, 1948-వ తేదీ వ్రాసిన లేఖలో స్పష్టము చేసిరి. ఇపుడు కేంద్ర ప్రభుత్వముకూడ 290 సెక్షన్‌ను అనుసరించియే ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ కార్యక్రమమును ప్రారంభించి యుండెను. ఈ పరిస్థితులలో రాష్ట్రప్రధాని భావించుచున్నట్లు ప్రత్యేకాంధ్ర రాష్ట్రము జనవరి 26 లోపున ఏర్పడగల అవకాశము లేకపోలేదు.

తాత్కాలిక రాజధానివిషయమున కేంద్రప్రభుత్వము జోక్యము కల్గించుకొని తీర్పునిచ్చిన సత్వరాంధ్రరాష్ట్రనిర్మాణమునకు ఎట్టి ప్రతిబంధకములును ఉండజాలవు. ఒరిస్సారాష్ట్ర మేర్పడిన అనంతరము చాలకాలమువరకు బీహారు, ఒరిస్సా రాష్ట్రములకు ఒకే ప్రధాన న్యాయస్థానముండెను. అట్లే ఆంధ్రరాష్ట్రమునకు, శేషించిన చెన్నరాష్ట్రమునకును కొంతకాలము వరకు ఒకే న్యాయస్థానము ఉండవచ్చును. గవర్నరు విషయమున కూడ ఇట్టి ఏర్పాటు సాధ్యమే. ఈ విధముగ తాత్కాలికపు ఏర్పాట్లు చేసుకొనిన ఆంధ్రరాష్ట్ర రాజధాని తాత్కాలికముగ చెన్నపట్టణమున నుండక తప్పదు. సింధు, ఒరిస్సా రాష్ట్రములవిభజన జరిగినపుడు ఆ రాష్ట్ర ప్రభుత్వ స్థానములు కరాచీ,కటక్‌లందేర్పడినట్లే ఆంధ్ర ప్రభుత్వ స్థానము విజయవాడయం దేర్పడవలెనను వాదము సహేతుకము కాదు. సింధు, ఒరిస్సా రాష్ట్రముల విభజన సరిహద్దుల నిర్ణయముతోబాటు జరిగినది. పాట్నాపై ఓఢ్రులు గాని, బొంబయిపై సింధీలుగాని ఎన్నడు ఎట్టి హక్కును కలిగియుండలేదు. రాష్ట్రనిర్మాణమునకు వారట్టి హక్కులను వొదులుకొనుట జరిగియుండలేదు. కనుక సింధు, ఒరిస్సా రాజధానీ నగరముల నిర్ణయవిధానము చెన్నపట్టణము, ఆంధ్రరాజధానీ నగరముల విషయమై చేయునిర్ణయములకు సామ్యము గారాదు.

కేంద్రప్రభుత్వము ఈ విషయమున తన నిర్ణయమును గవర్నర్ జనరల్ జారీచేయు ఉత్తరువునందు స్పష్టము చేయవలసి యుండును. ఈలోపున జరుగవలసిన పనులవిషయమున రాష్ట్రప్రభుత్వము ఇప్పటికంటె ఎక్కువ శ్రద్ధ చూపవలసి యుండును. ఉత్తరువు చేరిన పదిరోజులకుగాని ఆ ఉత్తరువును విచారించుటకు మంత్రివర్గమునకు వీలు కాకపోవుట ఆశ్చర్యకరము. అవసర కార్యక్రమములు ఇందుకు ఆటంకములైనవనుటకు వీలులేదు. మంత్రులందరు పర్యటనలకు బయలుదేరిరి. ఈ రాష్ట్ర ప్రభుత్వము కేంద్రప్రభుత్వాదేశములను బట్టిగాక, తమిళ నాయకుల అభిమతమునుబట్టి వ్యవహరించుచున్నదని సందేహించుటకు ఈ కాలహరణము చాలును.

రాష్ట్రనిర్మాణము విషయమున చెన్నరాష్ట్ర మంత్రివర్గము గమనింపవలసిన ముఖ్య విషయము ఒకటి గలదు. ఆంధ్రరాష్ట్రము సె. 290 ప్రకార మేర్పడవలెనని కేంద్ర ప్రభుత్వము భావించుచున్నది. అట్లు జరిగిననే రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడు పరిషత్తు ఇచ్చిన అధికారమునుబట్టి ఆంధ్రను రాష్ట్రముల జాబితాలో చేర్చి తదనుగుణమైన సవరణలను రాజ్యాంగ శాసనమునందు చేయ వీలగును. గవర్నరు జనరల్ ఉత్తరువు జారీ అగుటతోనే రాష్ట్రము అవతరింపదు. రాష్ట్ర నిర్మాణమునకు అది ప్రాతిపదిక యగును. సింధు, ఒరిస్సా రాష్ట్రములుకూడ రాష్ట్ర నిర్మాణ ఉత్తరువులు జారీ అయిన ఒకమాసమునకు ఏర్పడినవి. కనుక జనవరి 26-న ఆంధ్రరాష్ట్ర స్థాపన కావలెననిన డిసెంబరు మాసముననే గవర్నరు జనరలు ఉత్తరువు జారీకావలసియుండును. అది రాష్ట్రప్రభుత్వ విధానముపైననే పూర్తిగ ఆధారపడియున్నది. ఆంధ్రరాజధాని నిర్ణయమైనగాని తాము ఎట్టి చర్య తీసుకొనజాలమని ఈ రాష్ట్రప్రభుత్వము తీర్మానించిన కేంద్రప్రభుత్వమే లోగడ రాష్ట్ర శాసనసభలు చేసిన తీర్మానములను, థార్ కమిషన్‌కు చెన్నరాష్ట్ర ప్రభుత్వ మంపిన సమాధానమును పురస్కరించుకొని రాష్ట్రనిర్మాణమున కవసరమైన చర్యలు తీసుకొనవలసియుండును. చెన్నపట్టణము కొంతకాలము ఆంధ్రరాజధానిగ ఉండుటకు వీలైనగాని ఆంధ్రరాష్ట్రనిర్మాణము సుకరము గాదని మాత్రము కేంద్రప్రభుత్వము గ్రహింపవలసియుండును.

## "థక్కర్ బాబా జీవితాన్ని యువకులు ఆదర్శంగా పెట్టుకోవాలి"

### 80 వ జన్మదినోత్సవ సందర్భమున పటేల్ నెహ్రూ ఉద్బోధలు

న్యూఢిల్లీ, నవంబరు 29: థక్కర్ బాపా జీవితము భారత యువకులకు ఆదర్శముగా నుండవలెను. దుర్భర దారిద్ర్యముతోను, ఎన్నటికిని అంతులేనికష్టముల వల్లను క్రుంగి కృశించుచున్న దేశమునకు నిరాడంబరముగా సేవచేయుట కెంతేని అవకాశము కలదు' అని ఉపప్రధాని సర్దార్ పటేలు థక్కర్ బాపా అని ప్రసిద్ధివహించిన శ్రీ అమృతలాల్ థక్కర్ 81 వ జన్మదినోత్సవములలో వక్తృత్వవహించుచు భారత యువకుల నుద్బోధించిరి.

ఈ సభలో ప్రధాని పండిత నెహ్రూ, రాష్ట్రపతి డా॥ పట్టాభిసీతారామయ్య, విద్యాశాఖమంత్రి మౌలానా అజాద్, భారతశాసనసభ అధ్యక్షుడు మావలంకర్, కార్మికశాఖమంత్రి శ్రీ జగజీవన్‌రామ్ గారలు ఉపన్యసించుచు థక్కర్ బాపాగారి స్వార్థరహిత నిరాడంబరసేవను వేనోళ్ళ కొనియాడిరి.

థక్కర్ బాపా కొండ ప్రదేశములకును, ఆటవిక ప్రదేశములకును వెళ్లి అచ్చట ఏకాంతముగా హరిజనులలోను, భిల్లులలోను స్వార్థరహితసేవ చేయుచుండిరని, శాసనసభలలోను, మంత్రి వర్గములలోను చేరి ప్రసిద్ధిలోనికివచ్చుట ఆయన కెంతమాత్రము యిష్టములేకుండెనని సర్దార్ పటేల్‌గారు చెప్పిరి. ఈ కారణముచేత థక్కర్ బాపా యువకులకు ఆదర్శముగా నుండవలెనని, దుర్భర దారిద్ర్యముతోను, అంతులేనికష్టములతోను క్రుంగి కృశించుచున్న దేశమునకు సేవచేయుట కెంతేని అవకాశముకలదని సర్దారు చెప్పెను.

'మొదట వినమ్రుడగు బంటుగా పనిచేయకుండా నాయకత్వమునకై ప్రాకులాడుట తప్పు. బంటుగా నుండకుండా నాయకత్వము లభించుట దుర్లభము. ఒకవేళ అది లభించినను అచిరకాలముననే అది నష్టమైపోవును. ఉపన్యాసములు చేయుటవల్ల, దూషణతో నిండిన వ్రాతలు వ్రాయుటవల్ల, చెవికోసిన వక్కవలె మాట్లాడుటవల్ల నాయకత్వము లభించునను భావము మన యువకులలో వృద్ధిజెందుచుండుట శోచనీయము. థక్కర్ బాపా సేవానిరతి రాష్ట్రసరిహద్దులకు అతీతము. వర్ణమునకు, మతమునకు అతీతము. మానవ కష్టములను బాపు అవసర మెచ్చట కలుగునో అచ్చట థక్కర్ బాపాసేవ చేయుచుండును' అని సర్దార్ పటేలు చెప్పిరి.

అణగద్రొక్క బడిన వారిలోను పేదస్థితిలోనున్నవారిలోను నిరంతరముగా సేవచేయుటవల్ల థక్కర్ బాపా ఒక సంస్థయయ్యెనని అతని సేవనుండి ఆయనను వేరుచేయుట చాలా కష్టమని ప్రధాని పండిత నెహ్రూగారు చెప్పిరి. 'మానవు లుపుట్టి, పొలములలోను, కార్యాలయములలోను, ఫ్యాక్టరీలలోను పనులుచేసి దాటిపోవుచుందురు వారిని స్మరించువారైనను వుండరు. కాని థక్కర్ బాపావంటి మహాపురుషులు అమరులు. ఎందువల్లననగా వారు ఒక ఉద్యమమునకు చిహ్నమైయున్నారు. వారి తరువాత వారి అనుచరులు ఆ పనులను సాగింతురు. థక్కర్ బాపా దీర్ఘకాలము జీవించి భారత ప్రజలకు సేవచేయుగాక! థక్కర్ బాపావంటివాడొకడు మనలో నున్నందున మనము గర్వించవలెను. ఆయన సేవానిరతి మనకు అత్యంతము అభిలషణీయము. 80 ఏండ్ల ప్రాయమున ఆ మహాశయుడు యువకునికుండదగిన ఉత్సాహముతో పనిచేయుచున్నాడు. ఈ ఉత్సాహమే మనకుగూడ నుండునని వాంఛింపదగియున్నది' అని పండిత నెహ్రూగారు చెప్పిరి.

థక్కర్ మహాపురుషుడని, భారత దేశమునకు నిజమైన సేవకుడని రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు చెప్పిరి. భారత జాతీయసౌధ నిర్మాణములో తోడ్పడిన మహనీయుడనిరి. భిల్లులు మున్నగు వెనుకబడిన తరగతులవారిలో అయన నిరంతరసేవ చేయుచుండెననిరి.

థక్కర్ బాపా అభినవభీష్ముడని యువకులకంటెగూడ ఆయనకు యెక్కువ ఉత్సాహముండెనని శ్రీ జి. వి. మావలంకర్ గారనిరి. స్వార్థరహితులగు యిట్టి వర్కర్లు చాలామంది దేశమునకు అవసరమనిరి.

మౌలానా అజాద్ గారు థక్కర్ బాబా నభినందించిరి.

హిందూమతము, విజ్ఞానము థక్కర్ బాపాలో మూర్తీభవించినవని శ్రీ జగజీవన్‌రామ్‌గారు చెప్పిరి. థక్కర్ బాపాను ఆయన దధీచితో పోల్చెను.

## ఇప్పటివరకు కోటి 83 లక్షల విదేశీ పెట్టుబడికి భారతప్రభుత్వ అనుమతి

### అధివేశశాసనసభలో ప్రశ్నకు పరిశ్రమల మంత్రి సమాధానం

న్యూఢిల్లీ, నవంబరు 28: విదేశీ పెట్టుబడులకు ప్రభుత్వం ఇస్తున్న సావకాశాలగురించి, పార్లమెంటులో వచ్చిన ప్రశ్నలకు, పారిశ్రామికమంత్రి సమాధానం చెపుతూ ఈ దిగువ వివరాలు తెలియజేశారు.

'భారతదేశంలో పరిశ్రమలు స్థాపించే నిమిత్తం, విదేశాలనుంచి యింతవరకు 59 విజ్ఞప్తులు వచ్చాయి. వీటిలో మొత్తం 183 లక్షల రూపాయల పెట్టుబడులకు యింతవరకు అనుమతులిచ్చాం. ఇవి చాలావరకు బ్రిటిష్ పెట్టుబడులు; ఇవి విద్యుచ్ఛక్తి, రేడియోలు, ఉక్కు, ఇనుము, వనస్పతి, ఫూలు, ఎంజినీరింగు పనిముట్లు, మోటార్లు, పెయింట్లు, వార్నిషులు, కాగితం, అట్టలు, తోళ్లు, ముడిఫిలిములు, అయేతరలోహాలు, రసాయినికపదార్థాలు, దంతపు గుండీలు, స్పోర్ట్సు సామానులు వగైరా పరిశ్రమలకు సంబంధించినవి.

'సాధారణంగా ఈ పెట్టుబడులకు ఈ ముఖ్య షరతులు విధించబడినై :

(1) భారతదేశపు పెట్టుబడి యెక్కువ ప్రమాణంలో వుండాలి. (2) జాతీయ నిర్వహణ. (3) దేశంలోని వ్యక్తులకు సాంకేతిక విద్యాశిక్షణయిచ్చి క్రమేపి విదేశీయులు రాకుండా వారి నే పనిలో పెట్టుకునే సావకాశం వుండాలి. ఈ పరిశ్రమలన్నీ పని ప్రారంభించటానికి సుమారు 5 సంవత్సరములవరకూ పట్టవచ్చును.

'ఇంకా విదేశాలలోని చాలా ప్రయివేటు కంపెనీలతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతున్నయ్. వారంతా వివరాలు తెలుసుకోవటానికి ప్రభుత్వానికి అనేక లేఖలు వ్రాస్తున్నారు. వారికికూడా సావకాశమున్న సహాయమంతా చేయబడుతుంది' అన్నారు.

అజిత్ ప్రసాద్ జైన్: అమెరికాతో ప్రధానమంత్రి నెరపిన సంప్రదింపులవివరాలేమైనా తెలియజేస్తారా?

శ్యామప్రసాద్ ముఖర్జీ: అమెరికా ప్రభుత్వంతో సంప్రదింపుల రూపకంలో యేమీ జరగలేదు.

కృష్ణమూర్తిగారు: విదేశ పెట్టుబడులకు అనుమతి నిచ్చే సందర్భంలో అందుమూలంగా నష్టపోయేదేశీయ పరిశ్రమలవారితో యేమైనా సంప్రదించారా?

డాక్టర్ ముఖర్జీ: ఆ విషయాన్ని సర్వధా దృష్టిపథంలోనే వుంచుతున్నాం.

రావుగారు: దేశంలో ఇప్పటికే బాగా సాగుతున్న పరిశ్రమల కేటికి నష్టం రాకుండా ప్రభుత్వం తగిన జాగ్రత్త తీసుకుంటుంది.

అనంతశయనం అయ్యంగారు : ఈ అనుమతి నిచ్చిన పరిశ్రమలు, డాలర్ ప్రాంతాల దిగుమతులను యెంతవరకు ఆపుచేయగలవు. ఈ అమెరికా దిగుమతుల భారాన్ని తగ్గించేందుకు ఏదైనా ఆలోచింపుతున్నారా ?

ముఖర్జీ గారు :— ఈ పరిశ్రమలవల్ల అమెరికా దిగుమతులు ఎంతవరకు తగ్గుతాయనే విషయాన్ని యిప్పుడేమీ చెప్పలేను. డాలర్ ప్రాంతంనుంచి దిగుమతి చేసుకుంటున్న కొన్ని ప్రజావినిమయ వస్తువులను ఈ పరిశ్రమలు తయారుచేసే సావకాశం వున్నది గనుక కొంతవరకు తగ్గుతాయని ఆశించవచ్చును. కాని వాణ్ని మూలసూత్రంగా పెట్టుకుని పనిచేసే సావకాశంలేదు. అదికూడా మనస్సులో వుంచుకునే పని చేస్తున్నాం. అదీకాక, కేవలం ఒక్క డాలర్ ప్రాంతాలనుంచే దిగుమతి అవుతున్న వస్తువంటూ యేదీలేదు. ఈ దేశంలో ఉత్పత్తులు పెరిగితే డాలర్ ప్రాంతాల దిగుమతులు సహజంగా తగ్గుతవి.

### సర్ చింతామణి దేశముఖ్ వివరణ

బొంబాయి, నవంబర్ 28 : 'ప్రధాన మంత్రి ప్రసంగాలు విన్న అనంతరం భారతదేశంలో పరిశ్రమలు స్థాపించటానికి అమెరికా పెట్టుబడిదారులు చాలా ఉత్సాహం చూపుతున్నా'రని చింతామణి దేశముఖ్ ఈ వేళ ఇక్కడ వివరించారు.

దేశముఖ్ గారు ఈ వేళ లండనునుంచి విమానంలో ఇక్కడికి చేరారు.

'అయితేవారు, భారతదేశపు పారిశ్రామిక విధానం మొదలైన ప్రాథమిక విషయాలను గురించి వివరాలు అడుగుతున్నారు. నేను కొంతమందితో ఈవిషయాలన్నీ ముచ్చటించాను. ఒడంబడికలు మాత్రం ఇంకా యేమీ జరుగ లేదు.' అన్నారు.

ప్రపంచ పరపతిసంఘంనుంచి తీసుకుంటున్న ఋణాలసంగతి వివరించుచూ, 'భాక్రానో విద్యుత్కేంద్రం కొరకు తీసుకుంటున్న అప్పు మినహా ఈ సంవత్సరానికి తీసుకునే ఇతరమొత్తాలేమీలేవు. 1950 లో ఉక్కు పరిశ్రమల నిమిత్తం, హీరాఖండ్ ప్రాజెక్టునిమిత్తం కొంత అప్పుతీసుకునే సావకాశంవున్నది.

'మనం అమెరికానుంచి అదనం మొత్తం గోధుమలు తీసుకోవటానికి యత్నించుతున్నామంటే అది వినిమయం నిమిత్తంగాదు. అదనపు ఆహారధాన్యాన్ని నిలవచేసి, దేశంలో ధరలు పెరగకుండా చేయటానికి ప్రయత్నించుతున్నాం. అయితే ఈ మొత్తాన్ని కొనేముందు మనం యెగుమతిచేసుకోగల ముడిపదార్థాల విషయంకూడా ఆలోచించుతాం.' అన్నారు.

ఈ విషయాలన్నీ ప్రభుత్వంతో సంప్రదించటానికి వీరు ఒక మూడురోజుల అనంతరం ఢిల్లీవెళుతున్నారు. వీరు 1950 ఫిబ్రియల్ వరకూ భారతదేశంలోనే వుంటారు.

## వెంకటనారాయణహత్య కేసు ముద్దాయిలపై దౌర్జన్య చర్యలు

### ఒకరి మరణం: మరొకరికి తీవ్ర గాయాలు

మచిలీపట్నం, నవంబరు 29: వెంకటనారాయణ హత్య కేసులో ముద్దాయిలై ప్రస్తుతం బెయిలుమీద ఉన్న మండవ కోటేశ్వరరావు, జానకిరామయ్య అనువారు రాఘవయ్య, సోమువారంనాడు మచిలీపట్నంలో కోర్టుకు హాజరవటానికి గాను ఆదివారం మధ్యాహ్నం బయలుదేరి ఆముదాల్లంక గ్రామంనుండి వస్తుండగా గ్రామ పొలిమేరల్లో ఎవరో పొంచివుండి వారిని బలంగా కొట్టినారనీ, ఫలితంగా కోటేశ్వరరావు మరణించినాడనీ, జానకిరామయ్యకు తీవ్రంగా గాయాలు తగిలినవనీ, వార్త వచ్చింది. స్వల్ప గాయాలతో తప్పించుకొన్న రాఘవయ్య మచిలీపట్నం ఆస్పత్రిలో చికిత్సపొందెను. జానకి రామయ్య పరిస్థితి ప్రమాదకరంగా నున్నదట. కోటేశ్వరరావు తండ్రి బసవయ్య, రాఘవయ్య యీ సంఘటన ననుసరించి పోలీసు సూపర్నెంటుకు చెప్పినారట, అవనిగడ్డ పోలీసు సర్కిలు ఇన్‌స్పెక్టరుగారు రాఘవయ్య, బసవయ్యలనుండి , వాఙ్మూలములు పుచ్చుకొని యింకను దర్యాప్తు జరుపుతున్నట్లు తెలియవచ్చింది. (స్వ. వి.)

## కృష్ణా జిల్లాబోర్డు సమావేశం

### వివిధ కార్యములకు ధనవ్యయం మంజూరు

బందరు, నవంబరు 25: నిన్న సాయంకాలము కృష్ణా జిల్లాబోర్డువారు చిలకలపూడిలోని బోర్డు భవనమున శాకా వెంకటరత్నంగారిఅధ్యక్షతను సమావేశమై యీ క్రింది తీర్మానాలు చేశారు.

జిల్లాబోర్డువారు తమ ఉత్తరప్రత్యుత్తరములను, ఇతర వ్యవహారాలను ఇకనుండి తెలుగులోనే జరుపుతారు. అదనముగా ప్రసూతి వైద్య కేంద్రములను స్థాపించుటకు, విస్సన్నపేట, నందిగామతాలూకాలోని చందర్లపాడులలో వైద్యశాలల నభివృద్ధిచేయుటకు, తుపాను బాధితుల వైద్య సహాయార్థం 6482 రూ॥ ఇంగ్లీషు వైద్యశాలల మందులకు 300 రూ॥, ఆయుర్వేద వైద్యశాలల మందులకు 1060-12-0, క్వైనైనుకొరకు 659-12-0, గుడివాడబోర్డు హైస్కూలు పాకల పునర్నిర్మాణానికి 600 రూ॥, దొండపాడు పాఠశాలకు 3500 రూ॥, తేల్లప్రోలు-ఇందుపల్లి రోడ్డు మరమ్మతుకు 15,000 రూ॥, లింగగిరి-హుజూర్నగరం రోడ్డు మరమ్మతుకు 3000 రూ॥, జిల్లాబోర్డు అధికారుల రాకపోకల సౌకర్యార్థం కారుగాని, మోటార్‌వాన్‌గాని కొనుటకు 15,000 రూ॥ మంజూరుచేశారు. జిల్లాలోని వివిధతాలూకాలనుండి బియ్యం మిల్లులు కట్టుకొనుటకు అనుమతించవలసిందని కోరుతూ వచ్చిన దరఖాస్తులలో 14 దరఖాస్తులను బోర్డువారనుమతించారు.

## శ్రీకాకుళంలో కలరా

### ముగ్గురి మరణం

శ్రీకాకుళం, నవంబరు 28 : 4,5 దినములుగా శ్రీకాకుళం పట్నమున వ్యాప్తమైన కలరా వ్యాధిమూలమున, యిద్దరు చనిపోయిరి. గుజరాతీపేటలో ఒకస్త్రీ కలరావల్ల చనిపోయినది. వ్యాధిసోకిన 5, 6 గురు చికిత్సనొందుచు తేరుకొనుచున్నారు. మ్యునిసిపల్ ఆరోగ్యాధికారులు వ్యాధినివారణకు తీవ్రంగా కృషి చేస్తున్నారు. (స్వ. వి.)

## రేడియో ద్వారా వ్యవసాయ చర్చలు

### శ్రీ ఎన్. జి. రంగా ప్రకటన

నిడుబ్రోలు, నవంబరు 25: ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు ఎన్. జి. రంగాగారు ఈ విధంగా విజ్ఞప్తి చేస్తున్నారు. "భారతప్రభుత్వపు బ్రాడ్ కాస్టింగుశాఖ ఆధ్వర్యమున మద్రాసు, తిరుచి, విజయవాడ, బొంబాయి, బరోడా అహమ్మదాబాదు, ఢిల్లీ, లక్నో రేడియోల ద్వారా "వ్యవసాయచర్చల" కార్యక్రమము ప్రారంభించినందుకు నేను సంతసిస్తున్నాను. గ్రామసీమల యందలి సాంఘిక జీవితమునుగూర్చి యీచర్చలు సాగించవలెనని ప్రభుత్వం కోరుచున్నది. ఈ చర్చలలో ఆరోగ్యము, వ్యవసాయపద్ధతులు, సాంఘికాభివృద్ధి, అధికాహారోత్పత్తిలను గూర్చి ముఖ్యచర్చలు, సూచనలు, ప్రతివారం ప్రసారం చేయబడును.

వయోజన విద్యాభివృద్ధి, విమర్శనాశక్తి వాదోపవాదముల నిపుణతల మొదలు, ఆసక్తిగల మన విద్యార్థులు ఈ విషయములో రేడియో కేంద్రములతో సంపూర్ణంగా సహకరిస్తారని ఆశిస్తున్నాను. రాష్ట్రప్రభుత్వములు తమ సాముదాయక రేడియో కేంద్రములను అభివృద్ధి చేయవలసినదనీ ఆయా గ్రామములలో స్థానికంగా వుండే ఉపాధ్యాయులు, యితర వుద్యోగులు, ముఖ్యముగా సహకారసంఘ పరిపాలకులు, గ్రామప్రజలు యీ చర్చలను అనుసరించుటకు వారివారి అభిప్రాయములను పంపుటకు ఏర్పాటు చేయవలసినదని, తద్వారా గ్రామీణులకు, విద్యార్థులకు, ప్రజాసామ్యముతోను ప్రభుత్వముతోను గల వైజ్ఞానిక సంబంధమును పెంపొందింపవలెనని కోరుచున్నాను. అఖిల భారత రేడియోవారి ఈ నూతన ప్రయత్నము దిగ్విజయమగు గాక అని కోరుచున్నాను."

## మత్తాయ్ ప్రకటన

(1 వ పేజీ తరువాయి)

వని యీ మధ్య 'ఎకనమిస్టు' (లండన్) పత్రిక వ్రాసిన వ్యాసాన్ని చూశారా ?

డా॥ మత్తాయ్ : వ్యాసాన్ని గురించిన వార్తను చూశాను. పరిస్థితులను చక్కగ గమనించి వ్రాసిన వ్యాసాలు కావని అని చెప్పగలను.

## వెండి బంగారాల ధరల తగ్గుదల

ఈ రోజు పార్లమెంటులో ఒక ప్రశ్నకు సమాధానం ఇస్తూ భారత ఆర్థిక మంత్రి జాన్ మత్తయిగారు వెండి నూరు తులాలకు నాటికి 25 రూపాయలు పడిపోయిందనీ, బంగారం తులం ఒకటికి రు 4 లు తగ్గిందనీ, దీనికి కేవల బహిరంగంగా మార్కెటులో రిజర్వు బ్యాంకు సాగించిన విక్రయాలే కారణమనీ తెలిపారు.

## వాటికన్‌లోని భారత రాయబారి ధోరణి

### పార్లమెంటులో ప్రశ్న: నెహ్రూ సమాధానం

న్యూఢిల్లీ, నవంబరు 28 : 'వాటికన్‌లో, తన అధికారపత్రాలు సమర్పించుతూ భారత రాయబారి చేసిన ప్రసంగం సమంజసం కానిమాట వాస్తవమే. దాన్ని భారత ప్రభుత్వంకూడా ఆమోదించలేదు. ఈ విషయాన్ని అయనకు తెలియజేయటంకూడా జరిగింది.' అని ప్రధాని నెహ్రూ, పార్లమెంటులో కామత్‌గారి ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. 'అయినా ఆయన భగవద్గీతను అగౌరవ' పరచే ఉద్దేశ్యంతో అలా ప్రసంగించలేదు. సత్యమనేది అన్ని మతాలలోనూ వుంటుందని చెప్పటమే దాని అభిప్రాయంగాని మరొకటిగాదు' అన్నారు.

వాటికన్ రాయబారి దన అధికార పత్రాలను దాఖలుచేస్తూ, 'కర్మన్ అన్‌ది మౌంట్' వుంటే భగవద్గీత ప్రతులన్నీ తగలబెట్టినా ప్రమాదంలేదు' అని ప్రసంగించిన సంగతి పాఠకులకు తెలుసు.

కామత్ :—భగవద్గీతనూ, హిందూమతాన్నీ - అసలు యే మతాన్నయినాగాని తూలనాడే వ్యక్తి విదేశాలలో మనకు ప్రాతినిధ్యం వహించటానికి అర్హుడేనా ?

ప్రధాని :-ఆయన హిందువుకు కావటమేగాక హిందువు డైనందుకు గర్వపడుతున్న వ్యక్తికూడా.

కామత్ :-ఇలాంటి తప్పిదాన్ని చేసివున్నా గూడా, ఈ మధ్యను ఈయన అధికారాలను విస్తృత పరచారట— నిజమేనా ?

ప్రధాని :-ఆయన చాలా శ్లాఘనీయమైన ఘనకార్యాలను సంఘటించారు.

## అట్లాంటిక్ రాజ్యాల ప్రధాన సైనిక చర్చలు

పారిస్, నవంబర్ 29: అట్లాంటిక్ ఒడంబడికలోని దేశాల సైనిక సమావేశం యీవేళ పారిస్‌లో ప్రారంభమైంది. దానిలో, బ్రిటన్, కెనడా, అమెరికా, ఫ్రాన్సు, డెన్మార్కు, బెల్జియం, నార్వే నెదర్లాండ్సు, లగ్జంబర్గు, ఇటలీ, ఐస్‌లండ్ పోర్చుగల్ మొదలైన 12 దేశాల సైనిక ప్రతినిధులు పాల్గొంటున్నారు. సమావేశం 3 రోజులపాటు జరుగుతుంది. రక్షణ మంత్రులు తయారుచేసిన రక్షణ పథకాన్ని గురించి సంప్రతించుతారు. నిన్నను అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు సైనికాధికారులు సమావేశమై చర్చా ప్రణాళికను తయారుచేశారు. ఆ రహస్యసమావేశానికి విలేఖరులను యెవ్వర్నీ హాజరుకానీ లేదు.

## విదేశ వ్యాపార దోపిడీ భయం

న్యూయార్కు, నవంబర్ 28 : భారత దేశంలోనూ, యితర పరిసరాలలోనూ కూడా విదేశ వ్యాపారదోపిడీ ప్రబలుతుందేమోనని చాలా భయభ్రాంతులున్నయ్. ఈ భయభ్రాంతే ఇండో అమెరికన్ ఒడంబడికకు అంతరాయంగా వున్నయ్' అని న్యూయార్కు టైమ్సు పత్రిక యీవేళ సంపాదకీయం ప్రకటించింది.

ఈ అంతరాయాలు మానసిక తత్వాలకు సంబంధించినవేగాని ఆర్థిక వ్యవహారాలకు సంబంధించినవి గావు.

'ఉన్నయిబ్బంది అల్లా భారతీయులకు విదేశ వ్యాపారస్తులయెడ వున్న అనుమానం ఒక్కటే. దేశాలు స్వాతంత్ర్యాన్ని సంపాదించటానికి పోరాడే తరుణంలో జాతీయోద్యమాలవారు ఇలాటి నినాదాలు చేస్తారు. ఈ అభిప్రాయాలు ఆయా దేశాలకు స్వాతంత్ర్యం లభించిన అనంతరం కూడా అలానే వుండిపోతై. ఇలాటి అనుమానా లుండవలసినపని లేదన్న మనం నచ్చచెప్పవలసివుంటుంది. వెనుకబడిన దేశాలకు అమెరికా సాయపడటానికి సావకాశం వుండాలంటే ఆయా దేశాలు, ముఖ్యంగా భారతదేశం ఈ రకం అభిప్రాయాలను మార్చుకోవాలి' అని వ్రాసింది.

## అఫ్ఘనిస్థాన్‌కు పాకిస్థాన్ ఆక్షేపణ

కరాచీ, నవంబర్ 28: కబూలులో నవంబర్ 6 వ తేదీన జరిగిన విద్యార్థిసమావేశంలో అఫ్ఘనిస్థాన్ విద్యాశాఖామంత్రి చేసిన ప్రసంగానికి పాకిస్థాన్ ప్రభుత్వం ఈవేళ తన ఆక్షేపణను తెలియజేసింది.

'మీ మంత్రులు గనుక ఇదేరకంగా ముందుకూడా పాకిస్థాన్ వ్యతిరేక నినాదాలు కొనసాగించేపక్షంలో ఉభయదేశాలమధ్యను స్నేహబాంధవ్యాలు పెంపొందే సావకాశం వుండదు' అని ఆ అధిక్షేపణ పత్రంలో తెలియజేసింది.

## కలకత్తాకు రాజాజీరాక

కలకత్తా, నవంబరు 29 : గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు ఈ ఉదయం విమానంలో గౌహతినుంచి కలకత్తా చేరారు. వీరు అస్సాంలో మూడురోజుల పర్యటన ముగించుకొని కలకత్తాలో రెండు రోజులపాటు వుండడానికి వచ్చారు.

# తుపాన్ బాధితుల సహాయ సంఘం

## నిధివసూళ్లకు ఏర్పాట్లు

మదరాసు, నవంబరు 29: గవర్నరుగారి ఆంధ్రతుపాను బాధితసహాయ సంఘ ప్రథమ సమావేశం నిన్న ప్రభుత్వ కార్యాలయములో జరిగెను. మాన్య శ్రీ భావనగర్ మహారాజాగారు అధ్యక్షతవహించిరి.

తుపానుబాధితుల సహాయ నిధికి విరాళములు వసూలుచేయవలసినదని ఇతర రాష్ట్ర గవర్నర్లకు, ప్రవాసులకు, నగరములమేయర్లకు పత్రికాధిపతులకు విజ్ఞప్తి చేయవలె నని కమిటీవారు నిశ్చయించిరి.

సహాయనిధి వసూళ్ళ నిమిత్తము కలెక్టర్ల అధ్యక్షత క్రిందజిల్లా కమిటీలను నెలకొల్పవలెనని కూడ నిశ్చయించిరి.

ఈనిధికి ఇచ్చు విరాళములకు ఇన్‌కంటాక్సును మినహాయింపు ఇవ్వవలెనని ఇండియా ప్రభుత్వమును కోరుటకు కూడ నిశ్చయించిరి.

# కృష్ణాజిల్లా తుపాను నిధి వసూళ్లు

బందరు, నవంబరు 25: కృష్ణాజిల్లా తుపాను నిధికిగాను యిప్పటివరకు ఈ దిగువ విరాళములు వసూలైనటుల జిల్లా తుపానునిధి కమిటీ అధ్యక్షులకు కృష్ణా జిల్లాకలక్టరుగారు ప్రకటనను పంపినారు.

శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామ ప్రసాద్ బహద్దూరు చల్లపల్లి రాజా రు. 5000, శ్రీ రామనాథ బాబు 500, పి. లింగయ్యచౌదరి 100, గోపాలకృష్ణ మోటారు ట్రాంసుపోర్టు కంపెనీతరఫున శ్రీ వి. కుటుంబరావు 250, నేషనల్ మోటారు ట్రాంసుపోర్టు కంపెనీకిగాను శ్రీ వి. కుటుంబరావు 250, కొల్లి కోటేశ్వరావు 250, యం. లక్ష్మయ్య 125, పి. రామకృష్ణ 125, బి. తాతయ్య 125, జీ. రామకోటయ్య 125, టి. వీరరాఘవయ్య 125, కొనూరి వెంకటేశ్వరావు 125, బి. బాలప్రసాదరావు 250, రాజా వాశిరెడ్డి బి. సి. యస్. వరప్రసాద్ బహద్దూరు 1000, సి. హెచ్. రామయ్య 500, సి. హెచ్. వెంకట కృష్ణయ్యనాయుడు 800, ఏ. పార్థసారథి 500, గుడ్లవల్లేరు పంచాయితీబోర్డు 1000, గుడ్లవల్లేరు మార్కెటింగు సొసైటీ 500, జిల్లాబోర్డు కృష్ణా 15000, రాష్ట్ర వెల్‌ఫేర్ కమిటీ కృష్ణాజిల్లా శాఖవారు 15000.

మొత్తము వసూళ్లు రు. 41150.

# తుపాను నిధికి విజయవాడ మ్యునిసిపాలిటీ విరాళము

విజయవాడ, నవంబరు 23: నేటి సాయంత్రం విజయవాడ పురపాలక సంఘమువారు తుపానునిధికై రు. 5000 లు మంజూరుచేసి, ఆ ధనమును జిల్లా కలెక్టరుకు అందజేయ తీర్మానించిరి. ఇదే తీర్మానములో, రు. 20 కి తక్కువ జీతమును పుచ్చుకొనుచున్న పురపాలక సేవకుల, ఇళ్లు పడిపోయినట్టి వారికి మాత్రమే— కుటుంబమునకు ఒక్కింటికి రూ. 10 నిచ్చుటకై రు. 10000 మంజూరు చేయుచూ, ఆ మొత్తమును ఖర్చుపెట్టుటకై ప్రభుత్వమువారు అనుమతి నీయవలెనని కోరిరి. ప్రభుత్వమువారు, ఎలెక్ట్రిసిటీ ఉత్పత్తికై మ్యునిసిపాలిటీకి తాము సప్లై చేయుచున్న బొగ్గుపై అధిక పన్నును వసూలు చేయుటను ఆపి వేయవలెనని పి. డబ్లియు. డి. మంత్రిగారితో విన్నవించుటకై ఒక రాయబార సంఘమును నియమించిరి. (స్వ. వి.)

# తుపాను బాధితులకు హిందూపురం యువకుల సహాయం

హిందూపురం, నవంబరు 27: హిందూపురం బ్లూస్‌క్లబ్ కార్యవర్గ సమావేశం నేటి ఉదయం శ్రీ. ఆనందకృష్ణమూర్తిగారి అధ్యక్షతను జరిగింది.

ఆంధ్రదేశ తుపానుబాధితుల సహాయార్థం సభ్యులనుండి విరాళములు వసూలు చేసి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీద్వారా తుపానునిధికి పంపుటకు వారు నిశ్చయించిరి. (స్వ. వి.)

# పోలీసు స్టేషన్‌పై కమ్యూనిస్టుల దాడి

## కాల్పులలో ముగ్గురికి గాయాలు

సేలం, నవంబరు 28: నమ్మకాల్ పోలీసు స్టేషన్‌లో, ముగ్గురు ఖైదీలను బంధించి వుంచారు. వీరిని విడిపించటానికిగాను రెండు వందలమంది కమ్యూనిస్టులు గుంపుగా వచ్చి పోలీసు స్టేషన్‌మీద దాడి చేశారు. పోలీసులపైన, రాళ్లూ, ఆసిడ్ గోళాలూ, విసిరివేశారు. పోలీసువారు కాల్పులు జరిపారు. ఈ సంఘర్షణలో గుంపులోని ముగ్గురు వ్యక్తులు గాయపడ్డారు. పోలీసువారికి కూడా కొంతమందికి గాయాలు తగిలినవి. వీరంతర్నీ హాస్పిటల్‌లో చేర్చారు. గుంపు చెదరిపోయారు.

# లాయర్ల ఖాతాలలో పార్టీల సొమ్ము

## పార్లమెంటు నిర్ణయం

న్యూ ఢిల్లీ, నవంబరు 28: న్యాయవాదులు కక్షిదార్ల డబ్బును 'కక్షిదార్ల పైకం' అని పేరుపెట్టి బ్యాంకులలో వేయాలనీ, నిబంధనలలో చెప్పబడిన పనులకు మాత్రమే న్యాయవాది ఆ డబ్బును వాడాలనీ, ఆ విధంగా వాడుతున్నట్లు చూసేబాధ్యత బ్యాంకులకు ఉన్నదనీ ఇటీవల బొంబాయి ప్రభుత్వం ఒక శాసనం చేసినది. ఆ శాసనంవల్ల బ్యాంకులకు అనవసర బాధ్యతలు ఏర్పడుతున్నవని చెప్పి బాధ్యతలను పరిమితపరుస్తూ పార్లమెంటు నేడొక బిల్లును ఆమోదించినది.

దేశ పారిశ్రామికాభివృద్ధికోసం పెట్టుబడి పెట్టటానికి నెలకొల్పబడ్డ ఇండస్ట్రియల్ ఫైనాన్సు కార్పొరేషన్‌లో వాటాలను కొనేహక్కును పెట్టుబడిసంస్థలకు ఇస్తూ ఇండస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్ ఆక్టును సవరిస్తున్న బిల్లునుకూడా పార్లమెంటు ఆమోదించింది. కార్పొరేషన్ షేర్లను భీమాకంపెనీలు, బ్యాంకులు కొందలైనవి పెట్టేపెట్టుబడులకు తగివున్న పెట్టుబడులుగా పరిగణించాలనీ, ఈ కార్పొరేషన్ ఉద్యోగులకు ప్రావిడెంట్ ఫండ్ సౌకర్యాన్ని ఏర్పరచాలనీకూడా ఈ బిల్లు నిర్దేశిస్తున్నది.

ఇండియా రిజర్వుబ్యాంకుకు ఇండస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్ తరఫున అప్పులు, బాకీల లావాదేవీలను జరిపే అధికారాన్ని ఇస్తూ రిజర్వుబ్యాంకు చట్టాన్ని సవరిస్తున్న మరొక బిల్లునుకూడా పార్లమెంటు ఆమోదించినది. ఈ మూడు బిల్లులనూ ఆర్థికమంత్రి డా॥ మత్తయ్ ప్రతిపాదించాడు.

1922 వ సం॥పు ఆదాయపు పన్ను చట్టాన్నీ, 1942 వ సం॥పు ఫైనాన్స్ ఆక్టునీ, 1943 వ సం॥లో చేసిన అదనపు లాభాలపన్ను ఆర్డినెన్సునూ, 1947 సం॥లో చేసినవాణిజ్యలాభాలపన్ను చట్టాన్నీ, 1947 సం॥లో చేసిన ఆదాయపుపన్ను ఎగవేత విచారణచట్టాన్నీ సవరించటానికి ప్రతిపాదించబడిన ఒక బిల్లును ఆర్థిక మంత్రి ఉపసంహరించుకొనగోరగా పార్లమెంటు అనుమతించింది. ఈ బిల్లు కిందటి ఏప్రిల్‌లోనే ప్రతిపాదించబడ్డది కాని వ్యవధిలేక నిలిపివేయబడ్డది. ఇప్పటివరకూ జరిగిన మార్పులనుకూడా ఇముడ్చుతూ మళ్ళీ వేరే ఒక బిల్లును ప్రతిపాదిస్తామనీ, వివాదాంశాలవిషయమై బడ్జెట్ చర్చలో మరొక సమగ్రమైన బిల్లును ప్రతిపాదిస్తామనీ డా॥ మత్తయ్ వెల్లడించాడు.

ఢిల్లీ రాష్ట్రంలో రోడ్డు రవాణానిర్వహణసంస్థ నొకదానిని నెలకొల్పాలన్న బిల్లును సెలక్టుకమిటీకి ప్రతిపాదించమని రవాణాశాఖ సహాయమంత్రి సంతానం ప్రతిపాదనపై చర్చ ముగియలేదు.

దేశంలో పంచదార విషయమై ఏర్పడిన కొరతను చర్చించేనిమిత్తం ప్రతిపాదించబడిన రెండు విరామ తీర్మానాలూ, ఆసమస్యపై చర్చకు వేరే ఒక రోజును ప్రత్యేకిస్తామని ప్రభుత్వం హామీ ఇచ్చిన మీదట ఉపసంహరించుకోబడినవి.

సింహళంనుంచి కొబ్బరి, తత్సంబంధ పదార్థాల దిగుమతిని అనుమతించటంవల్ల దేశంలో వాటి ఉత్పత్తిదారులకు కష్టాలు కలిగినవని దానిని చర్చించటానికి ప్రతిపాదించబడిన విరామ తీర్మానం వాణిజ్య మంత్రి సమాధానం విన్నమీదట ఉపసంహరించుకో బడినది. ఢిల్లీ ఇంగ్లీష్ వారపత్రిక "సెమనలిస్టు"ను నిషేధించిన విషయమై ప్రతిపాదించబడిన తీర్మానం సర్దార్ పటేల్ సమాధానం ఇచ్చిన మీదట ఉపసంహరించుకోబడినది. ఆ పత్రిక అతి తీవ్ర మతవర్గభావాలను ప్రచారం చేస్తున్నదనీ, కాశ్మీర్ ప్రభుత్వాన్నీ, భారత ప్రభుత్వాన్నీ ఆధారం చూపకుండా దురారోపణలను చేస్తున్నదని, సంపాదకుడు సరైన సంజాయిషీ ఇవ్వకపోవటంవల్ల నిషేధించవలసి వచ్చిందనీ సర్దార్ పటేల్ వెల్లడించాడు.

### ప్రభుత్వ బిల్లులు

అత్యవసర సప్లయిల చట్టాన్ని, రబ్బర్ ఉత్పత్తి విక్రయాల చట్టాన్ని సవరించటానికి సప్లయి మంత్రి డా॥ ముఖర్జీ రెండు బిల్లులను ప్రతిపాదించాడు. సైన్యశాఖ స్వాధీనం చేసుకున్న ఆస్తుల పరిహారం విషయమై అమలులోఉన్న ఆర్డినెన్సు స్థానంలో రక్షణమంత్రి బల్దేవ్‌సింగ్ ఒక బిల్లు ప్రతిపాదించాడు.

ఒకరాష్ట్రం లేక (సంస్థానం) నుంచి మరొక రాష్ట్రానికి డిటెన్యూలను మార్చే అధికారాన్ని ప్రభుత్వానికిస్తున్న ఆర్డినెన్సు స్థానంలో హోం మంత్రి సర్దార్ పటేల్ ఒక బిల్లును ప్రతిపాదించాడు. ఆయుధ చట్టంలో, ఎవ్వరూ ఆయుధాలను భూ, జల, మార్గాలరవాణా చేయకూడదని చెప్పిన భాగంలో వాయుమార్గాన్నికూడా చేరుస్తూ ఆయన మరొక బిల్లును ప్రతిపాదించాడు. వాణిజ్యమంత్రి నియోగి భీమాకంపెనీల నిబంధనలబిల్లు (వివరాలు లోగడ ప్రకటించబడినవి)నూ, భారతపత్రిక నావికాయాన చట్టాన్ని సవరించటానికి మరొకబిల్లునూ, ఎగుమతి దిగుమతి నిబంధనలను సవరిస్తూ మరొకబిల్లునూ ప్రతిపాదించాడు.

పరిశ్రమల కంట్రోలుబిల్లుపై సెలక్టు కమిటీ తవని వేదికను సమర్పించుటకివ్వబడిన కాలవ్యవధిని వచ్చేసమావేశంవరకూ పెంచాలని డా॥ ముఖర్జీకోరగా అంగీకరించబడినది.

# కాందిశీక చట్టం

## పురుషోత్తందాస్ టాండన్ వాంఛ

న్యూఢిల్లీ, నవంబర్ 28: త్వరలో శాసనను కానున్న కాందిశీక ఆస్తి ఆర్డినెన్సులో కఠినమైన షరతులుండరాదని నేడిచ్చట ఒక సభలో ఉపన్యసించుచు సం॥ రా॥ ఎసెంబ్లీ స్పీకరు బాబూ పురుషోత్తమదాస్ టాండన్‌గారు చెప్పిరి. దేశ విభజనమువల్ల కాందిశీకులకు కలిగిన అపారనష్టమును భర్తీచేయుటకుగాను భారత దేశములోనున్న కాందిశీకఆస్తిని ఉపయోగించవలెనని ఆయన ప్రభుత్వమువారిని కోరెను. ఆర్డినెన్సునందలి షరతుల యెడల అసంతృప్తి వెల్లడించుటకు ఈ సభ అ. భా. కాందిశీక సంఘ యాజమాన్యమున జరిగెను.

పాకిస్తానుయెడల సానుభూతికలవారు కొందరు దేశములో నున్నారని, ప్రభుత్వము వారిచ్చుచున్నవారుగా ఉపయోగించుకొన ప్రయత్నించుచున్నారని ఆయన చెప్పెను. ఇట్టివారు పాకిస్తానుకు వెళ్లిపోవుటకో లేకవ్యక్తిపరమయిన పౌరసత్వహక్కులు అనుభవించుటకో భారత దేశమునందలి ఆస్తినిఅమ్మివేయ ప్రయత్నించుచున్నారని ఆయనచెప్పుచు వీరు దేశమునకు ఉపద్రవకారులని, వీరి ఆస్తిని ప్రభుత్వము వశపరచుకొనవలెనని చెప్పిరి భారతదేశము అన్నిమతములవారిని సమానముగా జూచు రాజ్యమగుటచేత పాకిస్తాను మార్గమవలంబించజాలదని చెప్పుచు, ఏనను ఈ దృక్పథమువల్ల దేశక్షేమమునకు భంగము కలుగనివ్వరాదనిరి. దేశవిభజనమును అంగీకరించుటలో భారత నాయకులు గొప్పపొరబాటు చేసిరని, తాను మొదటినుండి యీ దేశవిభజనకు ప్రతికూలముగానుండెననియు ఆయన చెప్పుచు గతమును విస్మరించి, భవిష్యత్తు విషయమై ఆలోచించవలె ననిరి. బలవంతముగా తమ యిండ్లు వాకిండ్లు వదలిపెట్టవలసినవారికి యెన్ని సౌకర్యములు చేయవీలగునో అన్ని సౌకర్యములు చేయవలె ననిరి. డిసెంబరు 4 న ఆర్డినెన్సుకు అసమ్మతి దెల్పు ప్రదర్శనలు జరుపవలెనని టాండన్‌గారు కాందిశీకుల నుద్బోధించిరి.

### తీర్మానము

ఈ క్రింది అస్తులను చేర్చి ఆర్డినెన్సు నిర్వచనమును విస్తరింపవలెనని సభవారు తీర్మానించిరి.

(1) 1947 సం॥ మార్చి అనంతరము స్వయంగా గాని, తన బంధువులద్వారా గాని పాకిస్తానులో కాందిశీక ఆస్తిగా పరిగణింపబడు ఆస్తిలో వాటాగాని, హక్కుగాని సంపాదించుకొన్నవారి, ఆస్తి (2) పాకిస్థానులో శరణాగతులుగా పరిగణింపబడుచున్నవారి కొరకు తన ఆదాయమునుండి ద్రవ్యము పంపుచున్న వారిఆస్తి.

(3) భారతదేశమువందలి తమ ఆస్తిలో కొంతభాగము పాకిస్థానుకు మార్చినవారిఆస్తి మామూలు వర్తక వ్యాపారములలో తాము చెల్లించవలసిన ద్రవ్యమును చెల్లించినవారికి యిది వర్తించదు.

(4) భారతదేశమువందలి తమ ఆస్తికి బదులుగా పాకిస్థానులో ఆస్తిసంపాదించ ప్రయత్నించినవారి ఆస్తి.

(5) పాకిస్థానుకు వెళ్ళవలెనను ఉద్దేశ్యముతో పర్మిడెండ్వారా భారతదేశమునందలి తమ ఆస్తిని అమ్మినవారి లేక అమ్మనంగీకరించిన వారిఆస్తి.

# హిందూధర్మశాస్త్రబిల్లు తొలగించక పోతే

## సత్యాగ్రహ సంకల్పం

న్యూఢిల్లీ, నవంబరు 28: హిందూధర్మశాస్త్రపు బిల్లును పార్లమెంటు ఎజెండా నుండి తొలగించని పక్షంలో 'సత్యాగ్రహం' ప్రారంభించడానికి అఖిలభారత హిందూ కోడ్‌బిల్లు ప్రతికూల సంఘంవారు నిర్ణయించారు. పి. టి. ఐ.

# పశ్చిమగోదావరి కాంగ్రెసు వ్యవహారములు

విజయవాడ, నవంబరు 28: పశ్చిమ గోదావరి కాంగ్రెసు వ్యవహారములపై విచారణచేయుటకు నియమింపబడిన సంఘమునుంచి ఎక్నేని సుబ్రహ్మణ్యంగారు రాజీనామా నిచ్చుటవలన, అనుకున్నరీతిగా నవంబర్ 30 తేదీనాడు, ఏలూరులో విచారణసంఘ సమావేశము జరుగదనీ, తిరిగి సమావేశం ఎప్పుడు జరిగేదీ త్వరలో నిర్ణయింపబడుననీ తెలుస్తున్నది. (స్వ.వి.)

# "నర్సుల సంఖ్య ఎక్కువ కావాలి"

## షిల్లాంగ్‌లో రాజాజి ఉద్బోధ

షిలాంగ్, నవంబరు 28: ఆసుపత్రులలో వైద్యులకంటె గూడ రోగులకు ఉపచారముచేయు నర్సులు యెక్కువ ముఖ్యము. ఒక వైద్యుడు పెద్దఆసుపత్రిని నిర్వహింపవచ్చును. కాని యెంతమంది రోగులున్నారో అంతమంది నర్సులు కావలసియున్నది. ఈ కారణముచేత మనము నర్సులను యెక్కువగా తయారు చేయవలెను, అని గవర్నరుజనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారు యిచ్చట వెల్షుమిషన్‌వారిచే నిర్మింపబడనున్న ఆసుపత్రికి శంకుస్థాపన గావించుచు చెప్పిరి.

"నేను న్యాయవాదవృత్తి నవలంబింపక పోయినయెడల, తరువాతి రాజకీయములలో ప్రవేశింపకపోయినయెడల అటుతరువాత బాధ్యత లేని ఈ గవర్నరు జనరలు పదవిని స్వీకరింపకపోయిన యెడల బాలికగా జనించి రోగులకు వుపకారముచేయు వృత్తిలో ప్రవేశించుటవాడు చాలా యిష్టముగానుండెడిది. రోగులకు ఉపచారముచేయుటవల్ల కలుగు ఆనందము సంతృప్తి మరే పనివల్లను కలుగదు. కనుక ఈ ప్రాంతములలో రోగులకు చికిత్సచేయు పనిని ప్రారంభించిన నారీమణులప్రోత్సాహముపై యింతమంది బాలికలు నర్సింగ్ వృత్తిలో ప్రవేశించుటలో ఆశ్చర్యమేమియులేదు. ప్రజలు సరియైన అవకాశములు కల్పించినయెడల భారతదేశమునందటను స్త్రీలు హెచ్చుగా ఈవృత్తిలో ప్రవేశించెదరనుట కెట్టి సందేహమునులేదు పురుషునికి ఉపచారము చేయుటకై స్త్రీ జన్మించినది. భార్య ఉపచారిణి యే. వేరుమాత్రములేదు తల్లిగూడ నిట్టిదే ఈ ప్రాంతములలో వెల్షు మిషనువారుచేయుచున్న సేవ ప్రశంసనీయమై యున్నది. భగవత్ ప్రార్థనలతోను, మతసిద్ధాంతముల ఉచ్చారణతోను సంతృప్తిజెంది యుండక నిరంతరముగాను, నిరాడంబరముగాను ప్రజాసేవచేయుచున్న యిట్టి మత సంస్థలవారికి కృతజ్ఞతదెల్పుటకు మాటలు అపర్యాప్తములు అని శ్రీ సి. రాజగోపాలాచారిగారు చెప్పిరి.

### షిలాంగ్‌లో కార్యక్రమము

గవర్నరు జనరల్ నేడు తీరికలేకుండా కార్యక్రమము నిర్వర్తించిరి. ఉదయము మణిపూరు మహారాజా, ఆసామ్ ప్రధాని గోపీనాథబార్డోలాయ్, ఇతర మంత్రులు ఆసామ్ ఎసెంబ్లీ స్పీకరు, ఆసామ్ కాంగ్రెసు అధ్యక్షుడు, కార్యదర్శి ఆచారిగారిని దర్శించి మాటలాడిరి.

గవర్నరు జనరలు గౌరవార్థం ఆసామ్ గవర్నరు విందు చేసిరి. ఈ విందుకు ప్రముఖులనేకులు వచ్చిరి. మధ్యాహ్నం గవర్నరు జనరలు మిలిటరీ క్రాసులు ప్రసాదించిరి. సాయం సమయమున కొండజాతి నర్తకులు ప్రభుత్వ భవనములో అత్యంత ప్రేక్షణీయమైన నృత్య భంగిమలను ప్రదర్శించిరి. రేపు ఉదయము 7-45 కు గవర్నరు జనరలు విమానములో కలకత్తాకు బయలుదేరి వెళ్లుచున్నారు.

# వెల్లోడీ హోదా

## సంస్థాన ప్రధానమంత్రి పదవి

సికిందరాబాద్, నవంబరు 28: ప్రస్తుతం భారత ప్రభుత్వం సంస్థాన శాఖ కార్యదర్శిగా నున్న ఎం. కె. వెల్లోడీగారు డిసెంబరు 1 న ఢిల్లీనుండి ఒక ప్రత్యేక విమానంలో హైద్రాబాదు వస్తున్నారు. వారు ఆరోజునే మిలిటరీ గవర్నరు మేజరు జనరల్ చౌధరిగారినుండి చార్జీ తీసుకొంటారు, హైద్రాబాద్ ప్రభుత్వంలో ఆయన హోదా ప్రధానమంత్రి అనీ, ప్రస్తుతం ప్రధాన సివిల్ పరిపాలనాధికారిగా నున్న డి. ఎస్. బాక్లేగారు మంత్రిగా ఉంటారని తెలుస్తున్నది. కాప్టెన్ కృష్ణరెడ్డిగారు వెల్లోడీగారి ఎ. డి. సి. గా నియమించ బడినారు.

# మేజర్‌జనరల్ చౌధరి

## ఝాన్సీలోని సాయుధ దళంపై ఆధిపత్యము

సికిందరాబాద్, నవంబరు 28: ప్రస్తుతం హైద్రాబాదు మిలిటరీ గవర్నరుగా నున్న మేజర్ జనరల్ చౌధరీగారు, ఝాన్సీలోని ప్రథమసాయుధ దళ ఆధిపత్యం స్వీకరిస్తారని నేడిక్కడ తెలియవచ్చింది.

మిలిటరీ గవర్నరు పదవి వదలివేసిన తర్వాత చౌధరీగారు 28 రోజులు సెలవు తీసుకొని వెడుతున్నారు. ఆయన తమ సెలవు కాలమును గ్వాలియరు, కలకత్తా, పూనాలలో గడుపుతారు.

ఇటీవల యేర్పాటై నియమింపబడిన సాయుధ దళం కూడా ఝాన్సీ వెళ్లనున్నది.

# రేపోమాపో చుంగ్‌కింగ్ పతనం

(1వ పేజీ తరువాయి)

రావచ్చునని ప్రయాణీకులు చెబుతున్నారు. హాంగ్‌కాంగ్‌కు ఈవేళ రాత్రివరకు నార విమానం రాకపోవటంచేత, బహుశా వారు జనరలిస్సిమో చాంగ్‌కైషేక్‌ను కలుసుకోడానికి చెంగ్టూ వెళ్లి ఉండవచ్చునని ఊహించవలసి అవుతున్నది. ఈ వేళ ప్రొద్దున పలాయనమై పోతున్న ప్రజలలో నగరం చాలా అల్లకల్లోలంగా ఉన్నదని ప్రయాణీకులు చెప్పిరి. దక్షిణదిశ నుంచి పురోగమిస్తున్న కమ్యూనిస్టు అగ్రగామి దళాలు చికియాంగ్‌కు పక్కవాటుగా పోయి వాన్హ్సెంచియెన్‌ను చేరుకున్నవి. ప్రధానబలం పశ్చిమోత్తర దిశకు మళ్లి చుంకింగ్-చెంగ్టూ రాజమార్గానికి తెరవాటు వేయడానికి ప్రయత్నిస్తున్నది.

పశ్చిమదిశనుండి పురోగమిస్తున్న కమ్యూనిస్టు సైన్యాలు పెఛియేకు 10 మైళ్ల దూరంలోకి వచ్చినవని, తెలిసింది; ఇక్కడ కమ్యూనిస్టులు మార్గావరోధంచేసేట్లయితే సెకువాన్ రాష్ట్రంలోని జాతీయ సైన్యాలకు దక్షిణ చైనాలోని జాతీయసైన్యాలకు మధ్య సంబంధం పూర్తిగా విచ్ఛిన్నమై పోగలదు; కమ్యూనిస్టులు ఈ దోవను కట్టేస్తే సెకువాన్ రాష్ట్రంలోని జాతీయ సైన్యాలకు సికాంగ్ రాష్ట్రంలోకి తప్ప మరెక్కడికీ పారిపోవడానికి మార్గం ఉండదు. దీనివెనక కాలవచ్చిన ఒకవార్త ఇలా చెబుతున్నది: కమ్యూనిస్టుసైన్యాలు చుంగ్‌కింగ్‌ను మూడు వైపులనుంచి చుట్టుముట్టుతున్నందువల్ల జాతీయప్రభుత్వం నగరమంతటా సైనికశాసనం ప్రకటించింది. కర్ఫ్యూకూడా విధింపబడినది.

# రాజకీయ సంఘంలో చైనాపై తీర్మానం

లేక్‌సక్సెస్, నవంబరు 28: అమెరికా ప్రతినిధి డా॥ ఫిలిప్‌జెస్సప్ ఈ వేళ రాజకీయసంఘంలో మాట్లాడుతూ, చైనా అంతరంగిక వ్యవహారాలలో ఐక్యరాజ్యసమితి సభ్యులెవ్వరూ అనవసరజోక్యం కల్పించుకోకూడదని హెచ్చరిక చేసెను. సోవియట్‌రష్యా చైనా కమ్యూనిస్టులకు వత్తాసు ఇచ్చి యాల్టా ఒడంబడికను భగ్నపరచినట్లు తెలుస్తున్నదనీ, ఇది చాలా ఆందోళన జనకమైన ఆరోపణ అనీ జెస్సప్ అనెను.

సోవియట్‌రష్యా, తూర్పు యూరోపియ రాజ్యం రాజకీయ సంఘ సమావేశాన్ని బహిష్కరించినది. అమెరికా, ఆస్ట్రేలియా, మెక్సికో, పాకిస్తాన్, ఫిలిప్పైన్స్ కలిసి తయారుచేసెను. ఒక సంయుక్త తీర్మానాన్ని డా॥ ఫిలిప్ జెస్సప్ నేటి సమావేశంలో ప్రవేశపెట్టెను. ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వం ఉన్న దేశాలన్నిటికీ ఈ క్రిందివిధంగా ఆదేశించవలసినదని జనరల్ అసెంబ్లీని తీర్మానం కోరుతున్నది:—

1. చైనా రాజకీయ స్వాతంత్ర్యాన్ని మన్నించి చైనాతో తమ సంబంధాలను సమితి ప్రణాళికను అనుసరించి నడుపుకోవాలి. 2. తమకిష్టమైన రాజకీయ సంస్థలను స్థాపించుకొని విదేశజోక్యం లేకుండా తమ పరిపాలనను తాము యధేచ్ఛగా సాగించుకోడానికి చైనా ప్రజలకు అధికారం ఉన్నదని గుర్తించాలి; చైనాప్రజల ఈ స్వతస్సిద్ధమైన హక్కుకు ప్రస్తుతంలోగాని ఇకముందుగాని భంగం కలిగించకూడదు. 3. చైనాతో లోగడ వ్రాసుకున్న ఒడంబడికలను యథాప్రకారం పాటించాలి. 4. చైనాలో ప్రాబల్యం నెలకొల్పుకొనడానికిగాని తమచేతిలో కీలుబొమ్మలాగా ఆడే ప్రభుత్వాలను స్థాపించడానికి విదేశమేదీ ప్రయత్నించకూడదు; చైనాలో ప్రత్యేక హక్కులను సంపాదించడానికి ప్రయత్నించరాదు." చైనాను తుండతుండాలుగా చేసి తనచేతిలో కీలుబొమ్మల్లాగా ఆడే ప్రభుత్వంలో నెలకొల్పడానికి రష్యా తంత్రాంగం సాగిస్తున్నదని చైనా ప్రతినిధి చెప్పినదానినిబట్టే గాక ఇతరత్ర తెలియవచ్చిన సాక్ష్యాన్నిబట్టికూడా అర్థం అవుతున్నదనీ, ఇది అమెరికా ప్రభుత్వానికీ సమస్త ప్రపంచానికీ తీవ్రమైన మనస్సంక్షోభం కల్గించిందనీజెస్సప్ అనెను.

ఈ విషయంమీద చర్చ జరిగినంతకాలం తాము సమావేశాలను బహిష్కరిస్తామని రష్యా తూర్పు యూరప్ రాజ్యాలు ప్రకటించినవి. 1945వ సంవత్సరంలో చైనాకు రష్యాకు జరిగిన ఒడంబడికను రష్యా భంగించిందని చైనా ప్రతినిధి చేసిన ఆరోపణలను అంతర్జాతీయ న్యాయస్థానంలో విచారణకు పెట్టవలెనని అమెరికా ప్రతినిధి ప్రతిపాదన చేసెను.

రష్యా మంచూరియాలోను లోపలి మంగోలియాలోను, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రములలోను కీలుబొమ్మ ప్రభుత్వములను స్థాపించినదని జెస్సప్ అనెను.

ఆస్ట్రేలియా ప్రతినిధి కేమ్సన్ మాట్లాడుతూ, చైనా తీర్మానాన్ని బలపరచకూడదనీ, ఈ తీర్మానం జరిగినదానికంతకూ తప్పుఒకరికి అంటగట్టినమేకాక చైనా భవిష్యత్తునుకూడా ఐక్యరాజ్యసమితే నిర్ణయించాలని కోరుతున్నదని చెప్పెను.

చైనా ప్రతినిధి డా॥ టి. ఎఫ్. ట్సియాంగ్ ఆస్ట్రేలియా ప్రతినిధి వాదాన్ని ప్రతిఘటిస్తూ తన తీర్మానంలోని కొన్ని అంశాలకు సంయుక్త తీర్మానంలోని కొన్ని అంశాలు సరిపోలుతున్నాయనీ, ఏమైనా, కమ్యూనిస్టు ప్రభుత్వం సర్దుకుముందుగానే తాను తీర్మానంలో ప్రతి విషయంమీద వోటింగు జరిపించి తీరుతాననీ, చెప్పెను. అనంతరం చర్చ రేపటికి వాయిదా పడింది.

# మలాన్ ప్రభుత్వ ధిక్కారచర్య

(1-వ పేజీ తరువాయి)

లని ఈ సంఘంవారు అంటున్నారు. కొందరు అసలు ఈ ప్రాంతాన్ని సమితి ధర్మకర్తృత్వం క్రింద వుంచాలంటున్నారు. ఆ ప్రాంతాన్ని స్వయం పాలిత ప్రాంతంగా దిద్దడానికి మేము ఏమిచేస్తున్నది చెప్పాలని మరికొందరు ప్రశ్నిస్తున్నారు. వీటి అన్నింటికి మేము ఒక్కటే ప్రత్యుత్తరం ఇవ్వదలచుకున్నాము. అది ఏమిటంటే, 'మేము పైవిషయాన్ని గూర్చి ఇతరులకుగాని, సమితికిగాని తెలియజెప్పవలసిన అవసరంలేదు.

సమితికి ఇతరుల విషయాల్లో జోక్యం కలుగజేసుకోవడం ఒక ఆటలాగావుంది. అదొపిచ్చిలాగావుంది. కాగా మేముఏమి చేస్తాము అనేది, ధర్మకర్తృత్వ సంఘం ఈ విషయంలో తన రిపోర్టును సమితి సర్వసభ్య సమావేశం ముందు పెట్టినప్పుడు నిర్ణయమౌతుంది.

# ధర్మకర్తృత్వ సంఘంలో చర్చ

లేక్‌సక్సెస్, నవంబరు 28: నైరృతి ఆఫ్రికా విషయమై దక్షిణఆఫ్రికా తన రిపోర్టులను సమితికి సమర్పిస్తూ వుండవలసిందని కోరుతూ ఇండియా తెచ్చిన ప్రతిపాదనమీద ధర్మకర్తృత్వ సంఘం చర్చ జరిపింది.

నైరృతి ఆఫ్రికావిషయంలో రిపోర్టును సమర్పిస్తానని మాటఇచ్చి, ఇప్పుడు దక్షిణఆఫ్రికా దాన్ని అతిక్రమించి నడుస్తున్నది. ఇది విచారించవలసిన విషయం. అందువల్ల ఈ సంఘం అటువంటి రిపోర్టులను సమర్పించవలసిందని దక్షిణఆఫ్రికాను మళ్ళీకోరుతున్నది అని ఈ తీర్మానంలో ఉటంకింపబడివుంది.

గాటెమాలాదీనికి ఒక సవరణప్రతిపాదిస్తూ నైరృతి ఆఫ్రికాను తన ధర్మకర్తృత్వంక్రిందవుంచవలసిందిగా ఇదివరకే సమితి కోరివున్నది. కాని దక్షిణ ఆఫ్రికా అట్లా చేయలేదు. ఆ విషయాన్నిగూర్చికూడా ఇప్పుడు ఆ దేశం విచారించవలసివుంది అని ఆ సవరణలో అన్నారు.

అసలు నైరృతి ఆఫ్రికా విషయాన్ని అంతర్జాతీయ న్యాయస్థానానికి తీసుకుపోవాలనికూడా ఇండియా ప్రతిపాదించింది. దీన్నిగూర్చికూడా కమిటీ చర్చించింది.

నైరృతిఆఫ్రికామీద ద. ఆ. కువుండు కున్న హక్కు లేమిటి? అంతర్జాతీయంగా ఆ ప్రాంతం హోదా ఏమిటి? అటువంటి అంతర్జాతీయమైన హోదా ఏదన్నా దానికి వుంటే, దాన్ని మార్చగలశక్తి ఏమన్నా దక్షిణఆఫ్రికాకువుందా? అటువంటిఅధికారం ఎక్కువ ఆఫ్రికాకు లేకపోతే, అందుకు తగిన వ్యవస్థ ఏది? అన్న ఈ ప్రశ్నలతో ఇండియా తీర్మానం కూడుకొని వుంది.

దక్షిణ ఆఫ్రికాకు ఇదివరకు నైరృతి ఆఫ్రికావిషయంలో సమితి ఇచ్చిన ఆదేశాలను గురుకు తీసుకురావాలని బ్రెజిల్, మెక్సికో లిబేరియా, పోలండులు కోరాయి. అట్లా చేయనిపక్షంలో తాను సమితితో పోరాడి విజయాన్ని సాధించానన్న భావం దక్షిణ ఆఫ్రికాను ఆవేశిస్తుంది అని వారు హెచ్చరించారు.

# మైకేల్‌స్కాట్ భోగట్టా ఇక్ష్వాకులనాటిది

లండన్, నవంబరు 28: "ఐక్యరాజ్యసమితిలో మైకేల్‌స్కాట్ ఇస్తున్న భోగట్టా యెప్పటిదో ఇక్ష్వాకులనాటిది. ఆయన చెబుతున్న 'బాంబెల్ జ్వాస్సు' సంఘటన యెప్పటిదో 1922 నాటిది. దానివిషయమై మా ప్రభుత్వం ప్రత్యేక కమిషన్‌ద్వారా విచారణకూడా జరిపించింది" అని లండన్‌లోని దక్షిణాఫ్రికా హైకమిషనర్ ఈ వేళ ఒకప్రకటన చేశారు.

'బాండెల్‌జ్వాస్సు' సంఘటనను వివరించుతూ, స్కాట్, దక్షిణాఫ్రికా ప్రభుత్వం అరక్షితులైన ప్రజలమీద బాంబులు వేసిందని ఐక్యరాజ్యసమితి ముందువివరించారు.

# దక్షిణాఫ్రికాలోని అమెరికా రాయబారి రాజీనామా

ప్రిటోరియా, నవంబరు 28: దక్షిణాఫ్రికాలోని అమెరికారాయబారి విన్‌పిషర్ తనపదవికి రాజీనామా దాఖలు చేశారు. వీరు కడచిన మార్చిలో, తన అధికార పత్రాలు దాఖలుచేసి ఉద్యోగం స్వీకరించారు.

# చెంగ్తూకు చైనా ప్రభుత్వం మార్పు

హాంకాంగ్, నవంబరు 29: చైనా జాతీయప్రభుత్వం చుంకింగునుంచి దానికి వాయవ్యంగా 200 మైళ్లలో వున్న చెంగ్టూకు మారినట్లు ఫార్మోజాలోని టైపేలోవున్న జాతీయ చైనా కార్యాలయం ప్రకటించింది.

చైనా ప్రభుత్వసేనలు గతరాత్రి చుంకింగుకు 8 మైళ్ల దక్షిణంగావున్న నాన్వెంజెన్ పట్టణాన్ని పునరాక్రమించినవని చుంకింగునుండివచ్చిన రేడియో టెలిఫోన్ వార్త తెలుపుతున్నది.

హాంకాంగు చుంకింగులమధ్య టెలిగ్రాఫ్ సంబంధం యథాప్రకారంగా వున్నది.

# గ్రీస్ ప్రజల ధైర్యసాహసాలు

1 వ పేజీ తరువాయి

స్వామ్య లక్ష్యాల అంతిమ విజయానికి శుభసూచన.

గ్రీసుకు గ్రీసు ఉత్తర సరిహద్దున ఉన్న రాజ్యాలకు మధ్య ఏర్పడిన అభిప్రాయభేదములను పరిష్కరించటానికి ఐక్యరాజ్యసమితి ప్రయత్నం చేస్తుంది; ఈ ప్రయత్నంలో అమెరికా యథాశక్తిగా తోడ్పడగలదు. బాల్కన్స్‌లో ప్రధానంగా అల్బేనియావల్లనే శాంతికి భంగం కలుగుతున్నదని ఐక్యరాజ్యసమితి తీర్పు చెప్పింది."

టర్కీనుగురించి ప్రస్తావిస్తూ, టర్కీ జనరల్ స్టాఫ్‌ను రక్షణశాఖతో కలిపివేయడానికి శాసనసభ మేలో నిర్ణయించిందనీ ఈ నిర్ణయం టర్కీ సైనిక వ్యవస్థలో చాలా ప్రధానమైన మార్పులు తీసుకొని రాగలదనీ, చెప్పెను.

"ద్వితీయ ప్రపంచ యుద్ధం సమాప్తమైన దగ్గరనుంచి రష్యా టర్కీ మీద అత్యవహితంగా విషప్రచారం సాగించడం ప్రారంభించింది. సన్నిహిత ప్రాచ్యంలోను టర్కీలోను అమెరికా సామ్రాజ్యవాదం క్రమంగా ప్రవేశించి వేళ్లు పాతుకుంటున్నదని దుష్ప్రచారం చేయ నారంభించిరి. టర్కీలో ప్రభుత్వంమీద అమెరికా మీదను విద్వేషం ప్రజ్వలింపజేయడానికి రష్యా ఎన్నివిధాల ప్రయత్నించాలో అన్నివిధాలా ప్రయత్నించింది. కాని ఈ ప్రయత్నాలన్నీ విఫలమైపోయినవి. టర్కీపై ఏలుబడి సాగిస్తున్న ఫాసిస్టునాయకులు దేశాన్ని అమెరికన్ సామ్రాజ్యవాదులకు అమ్మజూపుతున్నారనీ, దేశంలోని లిబరల్ వర్గాలన్నీ కట్టుకట్టి ఈ ఫాసిస్టునాయకులమీద తిరుగుబాటు చేయాలనీ రష్యన్ రేడియో ఇటీవల ప్రచారం చేయసాగింది.

ఇంత దుష్ప్రచారం రష్యా సాగిస్తున్నప్పటికీ, టర్కిష్ ప్రజలలో అమెరికా మీద విశ్వాసం సన్నగిలలేదు. పాశ్చాత్య రాజ్యాలతో తాము సన్నిహితంగా సహకరిస్తూ ఉండడమే, ప్రపంచ శాంతిభద్రతల రక్షణకు ప్రధాన సాధనోపాయమని టర్కిష్ ప్రజలూ నాయకులూ అచంచలమైన విశ్వాసంతో నమ్ముతున్నారు."

## ఓట్లు రికార్డు వేసేందుకు క్రొత్త సాధనం

మదరాసు, నవంబరు 24 :

"ఓట్లు రికార్డు చేసేందుకు క్రొత్తగా శ్రీ కె. రామానుజం (ఇండస్ట్రియల్ కెమిస్టు, సేలం) గారిచే నిర్మింపబడిన ఒక సాధనం ఈనెల 18-వ తేదీన మద్రాసు సెక్రటేరియట్‌లో మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులకు పత్రికా ప్రతినిధులకు ప్రదర్శింపబడింది. ఇది ఒక లోహపు పెట్టె. దీనిలో కొన్ని 'కీ' లు అమర్చబడి ఉన్నవి. వీటికి రంగులు వెయ్యవచ్చును. వోటు వేసేవారు కాగితం ముక్కకు బదులు ఒక ఇనప గోలీని ఉపయోగిస్తారు. ఎన్నిక అధికారి సమక్షానవారు ఆగోలీని, అందుకోసం ఏర్పరచిన ఒక కంతలో వదిలి, రహస్యపు గదిలోని లోహపు పెట్టెదగ్గరకు వెళ్ళి తమ వోటు ఎవరికివ్వదలిచారో ఆ అభ్యర్థి తాలూకు 'కీ' ని నొక్కుతారు. అంతట ఆగోలీ ఆ అభ్యర్థికి పడవలసిన వోట్లసంచీలో పడుతుంది. ఈ ప్రకరణ యొక్క రహస్యమును బాగా కాపాడగలదని శ్రీ కె. రామానుజంగారు తెల్పుతున్నారు. ఈ యంత్రంయొక్క ఉపయోగాన్ని గురించి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారు ఇలా వ్రాస్తున్నారు.

"శ్రీ కె. రామానుజంగారు నిర్మించిన బాలెట్ బాక్సును నేను పరిశీలించాను. దీనిని చూచినవారందరూ ఇది చాల తెలివితేటలతో తయారుచెయ్యబడిందని తప్పక మెచ్చుకోగలరు. ఇది బహువిధాల ఉపయోగకరమైనది. వోటు చేసేందుకు బాలట్ కాగితానికి బదులు ఇనపగోలీ ఏర్పరచబడింది. ఇది అరుగూ తరుగూ లేనిది. ఇందువల్ల బాలెట్ కాగితాలు అప్పుడప్పుడు ముద్రించవలసిన అవసరం తప్పుతుంది. ఈ పెట్టెకొక విధమైన తెర ఏర్పాటు ఉంది. ఇందువల్ల ప్రత్యేకంగా 'బూత్' నిర్మించవలసిన అవసరం తప్పుతుంది. ఈ పెట్టెను గోడకు కొంచం దూరంలో పెడితే చాలు, వోటు చేసేవారికి కావలసిన గోప్యం అంతా అమరుతుంది. ఈ యంత్రానికి గల మరొక ముఖ్యలక్షణం వోట్లు లెక్కించేందుకు చేసిన ఏర్పాటు. ఈ ఏర్పాటువల్ల బాలెట్ గోలీలు తప్పకుండా సరిగా నూరేసి చొప్పున లెక్కవుతవి. ఈ ప్రకారం వెయ్యవోట్లయినా ఇంచుమించు 5 నిముషాల్లో లెక్కపెట్టవచ్చును. ఓట్లు లెక్కించేందుకు నేడు ఎంతమందిని నియమించేది ఎంత శ్రమపడేది! చూచినవారు బహు నిర్దిష్టంగానూ, సులభంగానూ ఫలితాలు తెలుసుకునేందుకు ఆదుర్దాగా ఉండే అభ్యర్థులు ఎక్కువకాలం కనిపెట్టుకొనుండ నవసరంలేకుండా ఓట్ల ఫలితాలు తెల్పగల ఈ యంత్రం యొక్క ఉపయోగాన్ని గ్రహించగలరు. ఆపైన, తగిన కట్టుదిట్టాలతో వోటింగు ముగిసినవెంటనే అభ్యర్థుల సమక్షంలో గాని వారి ఏజంట్ల సమక్షంలో గాని పోలింగ్ బూత్‌లవద్దనే వోట్లు లెక్కపెట్టవచ్చును. ఇందువల్ల వోట్ల పెట్టెలను రిటర్నింగ్ ఆఫీసరు ఆఫీసుకుచేర్చి లెక్కపెట్టే దినంవరకూ జాగ్రత్త పెట్టేందుకు ఇప్పుడు చేస్తూన్న బందోబస్తు తప్పుతుంది. ఈయంత్ర సహాయంతో పోలింగ్ ఆఫీసర్లు చెయ్యవలసిందల్లా వోట్లు లెక్కపెట్టి రిటర్నింగ్ ఆఫీసరుకు తెలియబరచటం. ఆయన పోలింగ్ ఆఫీసర్లవద్దనుంచి వచ్చిన రిపోర్ట్లు నన్నిటినీ బట్టి ఫలితం ప్రకటించటం. ఇన్ని విశేషాంశాలున్న ఈ క్రొత్త బాలెట్ సాధనం పాదరసందీలో కూడిన నేటి ఎన్నికల వోటింగు విధానాన్ని నిశ్చయంగా బహు సులభం చెయ్యగలదు. మన ప్రభుత్వం ఈ క్రొత్త సాధనంయొక్క ప్రయోజనాన్ని పరిశీలించి ముందు ముందు ఎన్నికలలో దీన్ని అవలంబించగలరని ఆశిస్తున్నాను."

శ్రీ రామానుజం ఈసాధనాన్ని ఢిల్లీలో కాన్స్టిట్యుయంట్ అసెంబ్లీ అధ్యక్షులు డాక్టర్ రాజేంద్రప్రసాద్ గారికి, కాంగ్రెసు అధ్యక్షులు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారికి, కాన్స్టిట్యుయంట్ అసెంబ్లీ స్టీరింగ్ కమిటీ సభ్యులకూ చూపించి యున్నారు.

## సిల్కు చీరెలు

నరుకు ఫాక్టరీ యమ్మకము. 6 వాల ఆర్ట్ సిల్కు చీరెలు రు 5-4-0 లు ఎక్కువ నాణ్యమైనవి రు 6-8-0 లు. మొదటిరకం రు 10/- బెంగుళూరు అమెరికన్ సిల్కు చీరెలు రు 18/-లు. వీణా బ్రదర్సు, 101, మింటువీధి, మద్రాసు.

## 15 రోజులవరకు సగము ధర



| | | |
|---|---|---|
| రొంప్ క్రోం లోగడధర 36/- | ఇప్పటిధర 18/- | |
| గోల్డు కేసు ,, | రు 40/- | ,, రు 20/- |
| 6 జ్యూ. క్రోం ,, | రు 48/- | ,, రు 24/- |

రేడియంపెయింట్ ఏమర్జ లేదా టామా -

| | | |
|---|---|---|
| 6 జ్యూ. క్రోం లోగడధర 60/- | ఇప్పటిధర 30/- | |
| 7 ,, ,, | రు 68/- | ,, రు 34/- |
| 15 ,, ,, | రు 110/- | ,, రు 55/- |
| రోల్డు గోల్డు ,, | రు 130/- | ,, రు 65/- |

పోస్టేజి 12 అణాలు మూడు గడియారములు ఒకేసారి కొంటే ఒక రిస్టు వాచి ఉచితము

Jewellery Watch Co.,
Post Bag No. 6716, Calcutta 7

## "ఐక్య ఆంధ్రరాష్ట్ర నిర్మాణావకాశం కనుచూపు మేరలోకి వచ్చింది"

### విశాలాంధ్ర మహాసభాధ్యక్షుడు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి ప్రకటన

విజయవాడ, నవంబరు 26 :

"గవర్నర్ల రాష్ట్రాలైన మదరాసు, ఒరిస్సాలలోను, సంస్థానాలైన హైదరాబాదు, మైసూరులలోను చెల్లాచెదరైవున్నా, ఏకైక భూభాగంలో ఏకైక జాతిగా నివసిస్తున్న 3½ కోట్ల ఆంధ్ర ప్రజలను రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో సుస్థిరమైన పునాదులమీద ఏకీకరించే మహాశయంతో నిన్న విజయవాడలో విశాలాంధ్ర మహాసభ స్థాపింపబడినది. పై రెండు సంస్థానాలూ భారత రిపబ్లిక్‌లో చేరటం మూలంగా, ఐక్య ఆంధ్రరాష్ట్ర నిర్మాణావకాశం కనుచూపు దూరంలోకి వచ్చింది." అని అయ్యదేవర కాళేశ్వరరావుగారొక ప్రకటన చేస్తున్నారు.

కాళేశ్వరరావుగారు ఈ మహాసభకు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు.

ఆయన ఇంకా ఈ విధంగా చెప్పరిస్తున్నారు.

"వచ్చింది, వచ్చింది అని సంబరపడిన ఆ క్రొత్త ఆంధ్రరాష్ట్రంకూడా వెనక్కి తగ్గి, ఎండమావుల మోస్తరైంది. నూతన భారత రాజ్యాంగం ఆఖరు సారిగా ఆమోదింపబడే సమయంలోకూడా ఆంధ్రరాష్ట్రమును ప్రథమాధ్యాయపు మొదటి షెడ్యూలులో చేర్చలేదు. అంతిమోపన్యాసంచేస్తూ పరిషత్తు అధ్యక్షుడైనా దాని పేరును ఉచ్చరించలేదు. ఇది యావదాంధ్రదేశానికి నిరుత్సాహాన్ని, తీవ్రహృదయవేదనను ప్రజ్వరిల జేస్తున్నది.

విభజన వివరాలను తేల్చి చెప్పేందుకు నియమితమైన "విభజన సంఘము" కూడా ఆశాజనకంగా లేదు. ఉన్నత స్థాయిలో అట్టి సంఘాన్ని భారతప్రభుత్వమే ఏర్పాటు చేసివుండవలసివుంది.

ఆంధ్రులు మద్రాసు నగరమును ఆంధ్రరాష్ట్రంలో చేర్చాలన్న హక్కును పూర్తిగా వదులుకుంటూ దానిని చీఫ్ కమీషనర్ రాష్ట్రంగా నిర్మించాలని కోరారు. కనీసం దీనివల్లనైనా ఆంధ్రరాష్ట్రం నూతన రాజ్యాంగము ఆమోదింపబడక ముందే ఏర్పడి మొదటి షెడ్యూల్లో చేర్చబడుతుందనే నమ్మకంతోనే వారలా చేశారు. ఇప్పుడా అవకాశం మృగతృష్ణవలె మాయమైపోయింది. దీనితో మళ్ళీ ఢిల్లీ, మద్రాసులమధ్య ఏదో కుట్ర జరిగిందని, 1950 జనవరి 26 తరువాత ఎప్పటికో ఆంధ్రరాష్ట్రనిర్మాణం వాయిదా వేయబడిందనీ ఆంధ్రులు అనుమానిస్తున్నారు. జనవరి 26 తరవాతకు రాష్ట్రనిర్మాణం వాయిదా పడింగి అంటే, దానిని సుడిగుండం మధ్యకు విసిరి వేసినట్లే అవుతుంది. కనక జనవరి 26-వ తేదీకల్లా క్రొత్తఆంధ్రరాష్ట్రం ఏర్పడి పనిచేస్తూ వుండకపోయినట్లైతే, ఆంధ్రులుమళ్ళీ మద్రాసునగర సమస్యను ప్రారంభించి దానిని ఆంధ్రరాష్ట్రంలో పూర్తిగానో, సగంగానో చేర్చాలని ఆందోళన చేయుటానికి సంపూర్ణ హక్కు ఉన్నది.

ఆంధ్రులహక్కులను పరిరక్షించు [illegible] శక్తులన్నీ ఏకోన్ముఖమై నిలబడవలసిన సమయమిది. [illegible] ఏకీకరణముంకోసం, [illegible] ఉద్దీపవ్యవలసిన [illegible] ఈ ఉద్యమంలో సహకరించమని ఆంధ్రదేశానికి మేము విజ్ఞప్తిచేస్తున్నాము వచ్చే ఏప్రిల్‌లో విజయవాడలో గాని, వరంగల్‌లో గాని ప్రథమ విశాలాంధ్ర మహాసభను సమావేశం చెయ్యాలని మేము ప్రయత్నిస్తున్నాము."

మహాసభకు తాత్కాలికంగా కాళేశ్వరరావుగారు అధ్యక్షులుగాను, జమలాపురం కేశవరావు, న్యాయపతి నారాయణమూర్తిగారు ఉపాధ్యక్షులుగాను, కాటూరి వెంకటేశ్వరరావు, డా॥ ప్రకాశ చంద్ర శతపథి, ఎమ్. ఎస్. రాజలింగం, బి. వి. కృష్ణారావుగార్లు కార్యదర్శులుగాను, మరొక 60 మంది కేంద్ర సంఘ సభ్యులుగాను ఎన్నుకోబడ్డారు.

## 5 సం॥ముల మంత్రిత్వము

మదరాసు, నవంబరు 28 : శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, డాక్టరు టి. యస్. యస్ రాజన్ గార్లకు డిశంబరు 7 తో 5 సం॥ ముల మంత్రిత్వము పూర్తి అవుతుంది.

## బ్రిటిష్ కన్సర్వేటివ్ పక్ష ఎన్నిక ప్రచారం

### దుర్వ్యయం గూర్చి మారిసన్ తీవ్ర విమర్శ

బర్మింగ్‌హామ్, నవంబరు 26 : బ్రిటిష్ కన్సర్వేటివ్ పార్టీ ప్రచారం నిమిత్తం డబ్బు తెగ ఖర్చు పెట్టుతూ వున్నదని, కాని ఆ డబ్బు ఎక్కడనుంచి వస్తోందో తెలియని కారణం వల్ల ఎన్నికల ప్రచారం నిమిత్తం వారు నడుపుతున్న వ్యవహారం రాజకీయము, న్యాయ సూత్ర సంబంధియైన సమస్యలను ఉద్భవిల్ల చేస్తున్నదని, బ్రిటిష్ డిప్యూటీ ప్రధాని హెర్బర్ట్ మారిసన్ ఇక్కడ అన్నారు.

హెర్బర్ట్ మారిసన్ లేబరు పార్టీ ప్రచారాధిపతి. ఇప్పుడు టోరీ పక్షంవాళ్ల వ్యవహారమంతా దేశంలో ఏర్పడిపోయిన ఎన్నికల సంప్రదాయానికి విరుద్ధంగా వున్నదని ఆయన అన్నారు.

అసలు ఇప్పుడు ఈ ప్రచారంలోకల్లా ఎక్కువ ఉపద్రవకారి అయిన విషయము పెద్దపెద్ద వర్తకులు ఇందులో చెయ్యి చేసుకోవడంగా మారిసన్ పేర్కొన్నారు. వీరు పార్టీ ప్రచారాలకు గుప్తదానాలుచేస్తూ ఓటర్లమనసులు త్రిప్పే ప్రయత్నాల్లో నిమగ్నులు కావడం అసహజంగా వున్నదని ఆయన అన్నారు.

అందువల్ల ప్రభుత్వం ఎన్నికల ప్రచారంలో రాజకీయపక్షాలు ఎంతడబ్బు ఖర్చుపెట్టవచ్చు? ఎన్ని కార్లు వినియోగించుకోవచ్చు? అన్న విషయాలలో కొన్ని నిబంధనలు చేసిందని ఆయన వెల్లడిచేసారు.

## సమితి ఆహార వ్యవసాయ సంఘనివేదిక

### దక్షిణాఫ్రికా అధిక్షేపణ

వాషింగ్టన్, నవంబరు 26 : ప్రపంచ ఆహారపరిస్థితిగురించి ఐక్యరాజ్యసమితి ఆహార వ్యవసాయసంఘం తనని వేదికలో అసందర్భములైన, అసత్యములైన విషయాలు వ్రాసినదని, దక్షిణాఫ్రికా ప్రభుత్వంయిత్వాళ అధిక్షేపణ తెలిపింది.

తూర్పు కేప్ రాష్ట్రంలో ప్రజలకు తినుటకు తిండిసరిగాలేదని, అనేకమంది పసిపిల్లలు తిండికరువుతో మరణించారని శిశువ్యాధులు ప్రబలంగా ఉన్నవని, స. అ. వ్య. సంఘం తమనివేదికలో వ్రాసింది.

ప్రపంచ ఆహారసమస్యలను విచారించే కమీషన్‌లో దక్షిణాఫ్రికా ప్రతినిధివర్గ నాయకుడు మాట్లాడుతూ, ఆగస్టు, సెప్టెంబరు నెలలలో యేదోఒకవార్త పత్రికలో ప్రచురింపబడిన విషయాలను ఆధారంగా పెట్టుకొని యీ నివేదికలో స. అ. వ్య. సంఘం యిలా వ్రాసిందని అన్నాడు. ఇలా తప్పుడువ్రాతలు వ్రాసినందుకు, ప్రభుత్వంతరఫున తీవ్రఆధిక్షేపణ తెలుపడం నావిధి. ఈ విషయములను విచారించి తెలుపవలసిందిగా కమీషన్‌కు నేను విన్నవించుకొంటున్నాను. దక్షిణాఫ్రికా ఆరోపణలకు, సమితి ఆహారవ్యవసాయ సంఘ డైరక్టర్ జనరల్ మారిస్‌డాన్ సమాధానం యిచ్చేవరకు, ఏచర్యా తీసుకొనగూడదని, చర్చను కమీషన్ అధ్యక్షుడు వాయిదా వేశాడు.

## "నా దేశంలో జాతి వివక్షత లేనేలేదు"

### పర్షియా రాజు ప్రకటన

మిచిగన్, నవంబరు 27: మిచిగన్ విశ్వవిద్యాలయంవారు బహూకరించిన న్యాయశాస్త్ర గౌరవ బిరుదాన్ని స్వీకరిస్తూ నిన్నరాత్రి పర్షియా రాజు ఇలా ప్రసంగించారు :

'నా దేశంలో జాతి వివక్షత అనేది యెప్పుడూ లేదు. ముందు వుండబోదు కూడా.

'ఇరాక్ వారిమీద తీసుకున్న చర్యలు యూదులకు బాధాకరంకాదా? ఇరాక్‌లో వున్న 1500 మంది ఇరాకీ ప్రజలలోనూ 30 మంది మినహా తక్కిన వారంతా యూదులేకదా?' అని పత్రికా విలేఖరులడిగిన ప్రశ్నకు సమాధానంగా ఆయన ఇలా అన్నారు :

'శక్తి చాలక, ఇరానుకూ పెద్ద లేగాసా దేశాల ప్రస్నటు చాలు లేచదు. ఇది మొత్తం 40 మంది కొండజాతులకు సంబంధించిన చిన్న సమస్య. సరిహద్దు దాటించి వారిని [illegible] లోకి పంపాను. అయితే నా దేశం ఇంకా ఏ మతస్థులనూ ఎవ్వరినీ నిరాకరించదు' అన్నారు.

'ఇది ఏకవిధంగా, వ్యక్తిగత క్రమం' అన్నారు. కాని ఈ వాక్యాన్ని వివరీకరించటానికి నిరాకరించారు.

## ఆంద్రీ విషిన్స్కీ 66-వ జన్మదినం

లేక్‌సక్సెస్, నవంబర్ 27 : రష్యా విదేశాంగ మంత్రియగు ఆంద్రీ విషిన్స్కీ గారికి యిప్పుడు 66 సంవత్సరము ప్రవేశించినది. నేడు ఆయన జన్మదినము ఇతడు యీ విదేశాంగమంత్రిపదవికి వచ్చుటకు చాలా కృషి చేసి తన తంత్రాంగఫలితం వల్లనే పైకి రాగలిగెను.

ఇతడు ఒడెస్సానగరంలో మధ్యతరగతి సామాన్య కుటుంబమునందు జన్మించెను. న్యాయశాస్త్రం చదువుచుండిన దినములలో రష్యనువిప్లవమునందు ఇతడు మితవాద పక్షమైన మెన్షెవిక్కు పార్టీలో చేరెను. అప్పుడితడు కీవునగరములో నుండెను. 1917 సం॥ వరకు న్యాయవాద వృత్తియందు తాను పైకిరావలెనని విషిన్స్కీ కృషిచేసెను మొదటి ప్రపంచ సంగ్రామ దినములలో సైన్యంలో చేరకుండా తప్పించుకొని తిరిగెను రష్యను విప్లవమునందు పెద్ద సాహసకార్యాలు ఏమిన్నీ చేయలేదు. 1920 సం॥ ములో విజయంపొందిన బోల్షివిక్కు పార్టీలో చేరెను.

కమ్యూనిజమునుయొక్క చరిత్రనుగూర్చి అనేక వ్యాసములు వ్రాసెను. జినోవీవును తన రచనలయందు ఎక్కువగా స్తోత్రపాఠంచేసెను. కాని తన వ్యాసములలో స్టాలినునుగూర్చి ప్రస్తావన చేయలేదు. అయినప్పటికీ అతడు 1931 లో పబ్లికు ప్రాసిక్యూటరు అగుటకు అది యొక ఆటంకము కాలేదు. అతని పేరు రష్యాకు వెలుపల ఇతర దేశాలలో ఎక్కువ ప్రసిద్ధికెక్కెను. 1936-37 సం॥ల యందు జరిగిన నేర విచారణలయందు ఇతడు పబ్లికు ప్రాసిక్యూటరుగా ఉండి సింహగర్జనము చేసి కవమెత్తినట్లు తాండవమాడెను. నేడు ఐక్యరాజ్య సమితిలో రష్యా తరపు ప్రతినిధిగా వ్యవహరించుచున్నాడు. తానొక జగత్ప్రసిద్ధ పురుషుడుగా పరిగణింపబడవలెనని అతని కోరిక-అతనికోరికమిన్న మిట్టినదని ఇంకను చెప్ప వీలులేదు.

## మదరాసు వేరుసెనగ మార్కెటు

వేరుసెనగనూనె వ్యాపారంమందం

చెన్నపట్నం, నవంబరు 28 : వేరుసెనగపప్పు కొంత ఎక్కువధరలతో గిరాకి కలిగి పట్టుకుతగిన గిరాకిలేక పప్పుధరలు ఎక్కువగానుండినప్పటికీ నూనెధర తగ్గుముఖముగా నుంటున్నందున వేరుసెనగ మార్కెటువ్యాపారములో తిరిగి కొద్దిగా క్లిష్టపరిస్థితి ఏర్పడినది.

సకాలమున వర్షాలు లేకపోవుటచేత మిల్లులలో వేరుసెనగ పిట్టు విక్రయంజరుగకుండా విశేషముగా పేరియున్నవి. వేరుసెనగధర అధికముగానుండి నూనెధర మందముగానున్నందున మిల్లులు కొత్తసరుకును గానుగఆడుటకు వెనుదీయుచున్నారు. వేరుసెనగపిట్టు విశేషముగా పేరిపోయియుండగా పిట్టుదొరకుట కష్టముగానున్నదని తెలుపుతూ దానిని కంట్రోలుచేయమని యిటీవల కొందరు శాసనసభ్యులు కోరడం వింతగాదోచగలదు అనేకస్థలములలో 160 పౌనుల బస్తా వేరుసెనగపిట్టు ధరకు రు 15 కైనా కొనేవారు లేకున్నారు వేరుసెనగ పిట్టు యింకా చౌకగా చేయవలెనని ప్రభుత్వం దలచేట్లయితే ఇండియా ప్రభుత్వం సహకారంతో రాష్ట్ర ప్రభుత్వం వేరుసెనగ పప్పు ఎగుమతి నిషేధించవలెను. పప్పు బదులు నూనె ఎగుమతికావటానికి తగు ప్రోత్సాహం మొదలెట్టుయితే పిట్టు విశేషముగా రాష్ట్రంలో తయారైయుండుటకు వీలు కలుగును. పప్పుధరను కంట్రోలులోకి తీసుకొనిరాకుండా పిట్టుమాత్రం కంట్రోలు చేయదలిస్తే పరిశ్రమకు దెబ్బ తగులును.

వేరుసెనగ పప్పుధర వారంపొడుగునా స్థిరముగానుండి వారాంతమున అన్ని కేంద్రములనుండి క్రొత్తపంట సరుకు అందినందున ధర కొద్దిగా తగ్గెను. షిప్పర్లు మిల్లులవారు, కలకత్తా అదోని వర్తకులు ముఖ్యముగా కొంతసరుకు కొన్నారు. తరువాత అదోని వర్తకులు బేరంచేయుటం మానుకోగా కోరమండల్ సరుకు క్యాండి ఒకటి రూ. 157/- 157-8-0 కి న్నూ, ఖండేశ్ సరుకు రూ 160/161 వరకును తగ్గెను. నూనె మార్కెటు తక్కువ ధరతో మందముగా నుండెను కలకత్తా రంగూను [illegible] తమ తక్షణ అవసరానికి కావలసిన సరుకును మాత్రమే కొన్నారు.

నూనె ధరలు యీ రీతిగా నుండినవి. రెడీ (2 నుండి 3% యఫ్ యఫ్ ఏ) రూ 337- నుండి 338- నవంబరు అంతం రూ 337- డిసెంబరు అంతం రూ 334 జనవరి అంతం రూ 350/-

దక్షిణాదిలో వేరుసెనగ ధరలు రూ 158 నుండి రూ 160 వరకు యున్నవి.

రంగూనులో అంతరంగ [illegible] యుటకు డిశెంబరు వాయిదా సరుకు వేరుసెనగ నూనెకు బన్నా [illegible] టన్ను 1 కి రూ 1750 నుండి రూ 1760 ధర తెలుపుచున్నారు.

## మదరాసు వార్తలు

### డిటిన్యూ విడుదల

చెన్నపట్నం, నవంబరు 28 : కర్నూలు జిల్లా కమ్యూనిస్టు డిటెన్యూ అయిన వై. స్వామిరెడ్డిని విడుదలచేస్తూ మదరాసు ప్రభుత్వం ఈ ఉత్తరవు చేసెను.

### ఆంధ్ర హరిజన సంఘం

కొండితోపులోని ఆంధ్ర హరిజన సంఘం జనరలుబాడి సమావేశము 25 వ తేదీన శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణగారి అధ్యక్షతను జరిగినపుడు యీ దిగువ కార్యవర్గము ఎన్నుకొనబడినది : అధ్యక్షులు భా. లక్ష్మీనారాయణగారు, ఉపాధ్యక్షులు : ఆర్. పి. కొండయ్య ఎ. రాఘవులు, ప్రధాన కార్యదర్శి కె. జి. విలియమ్సు, జాయింటు కార్యదర్శి బి. సి. నాగయ్య, కోశాధికారి ఆర్. పెద్ద రాఘవులు మరి 13 గురు కార్యవర్గ సభ్యులు.

### భీమా-పనివారి సంఘం

చెన్నరాష్ట్ర భీమా కంపెనీల పనివారల సభ మహాజనసభ హాలులో టి. ఎస్. రామానుజంగారి అధ్యక్షతను జరిగెను. ఈ పనివారి సంఘం ఒంటి స్థాపించి రిజిస్టరు చేయుటకు తీర్మానించబడెను. ఈ దిగువ కార్యవర్గం ఎన్నుకోబడెను. టి. ఎస్. రామానుజం అధ్యక్షులు. అంతోని పిళ్లై, ఆర్ రామానుజం ఉపాధ్యక్షులు. ఎ. పరమానందం కార్యదర్శి. పప్పు శ్రీ రామమూర్తి జాయింటు కార్యదర్శి.

### అ. భా. జైయిన్ సభ

అ. భా. ఎస్. ఎస్. జైయిన్ మహాసభ 24, 25, 26 తేదీలందు మాంబళంలో జైయిన స్కూలునందు బొంబాయి అసెంబ్లీ అధ్యక్షులు శ్రీ కుందనమాల్ ఫిరోడియా గారి అధ్యక్షతను జరుగును. గౌ॥ పి. కుమారస్వామిరాజాగారు ప్రారంభోపన్యాసము నొసంగెదరు.

### కీ॥ శే॥ వరదా కామేశ్వరరావు నాయుడుగారు

శ్రీ వరదా కామేశ్వరరావునాయుడు గారు, 83 వ ఏట తమ స్వగృహమునందు పూండిలో (విశాఖజిల్లా) 26 వ తేదీన కాలధర్మమునొందిరని తెలుపుట కెంతయు విచారమగుచున్నది. వీరు వెనుక శాసన సభ్యులుగానుండిరి. మిల్లు యజమానులు. చాల దానధర్మములుచేసి కీర్తిగడించిరి. భార్య, యిరువురు కుమారులు, ఒకకుమార్తె పెక్కుమంది మనుమలు బంధుమిత్రులు, వీరికై వగచుచున్నారు.





# తిరుపతి పురపాలక సంఘంలో చీలికలు

## అధ్యక్ష ఉపాధ్యక్షులపై అవిశ్వాస తీర్మానం

### ఉపాధ్యక్షుని రాజీనామా

తిరుపతి నవంబరు 27: తిరుపతి పురపాలక సంఘ ఉపాధ్యక్షుడు కె. రంగస్వామి అయ్యంగార్ తమపదవికి రాజీనామా యిచ్చారు. అధ్యక్షుడు దీని నామోదించి మారిన ఉపాధ్యక్షుని నెన్నుకొనుటకు డిసెంబరు 12 వ తేదీకి ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేశారు.

నిన్నటిదినం అధ్యక్ష, ఉపాధ్యక్షులపై 12 మంది సంఘ సభ్యులు విశ్వాస రాహిత్య తీర్మానం ప్రతిపాదించటానికి చంద్రగిరి ఆర్. డి. ఓ. కె. వి. శివసుబ్రహ్మణ్యంగారి వద్ద ఒక పిటీషను దాఖలు చేశారు. "జిల్లా మునిసిపాలిటీల శాసనం" ప్రకారం ఒక ప్రత్యేక సమావేశము నేర్పాటు చేయవలసిందని వారాయనను కోరారు. ఆయన దానికి సమ్మతించి డిసెంబరు 16 వ తేదీన పురపాలక సంఘాన్ని సమావేశం చేస్తున్నారు.

25 వ తేదీన పురపాలక సంఘం సి. ఎస్. రామయ్యగారి అధ్యక్షత క్రింద సమావేశమైనది. సెప్టెంబరు 19 న తాము దాఖలు చేసిన విషయము అజెండాలో చేర్చుటకు అధ్యక్షుడు నిరాకరించు చుండుటచే ఇది సభ్యులకు అగౌరవకరంగా ఉన్నదని, దీనికి తమఅసమ్మతి సూచకంగా సభ 5 నిమిషాలు వాయిదా వేయాలనీ డా॥ జగన్నాధరావుగారు తీర్మానం ప్రతిపాదించారు. పి. వెంకటరెడ్డిగారు బలపరిచారు: ఉపాధ్యక్షుడు కె. రంగస్వామి అయ్యంగార్ దాని నెదిరించారు. అధ్యక్షుడు తీర్మానం త్రోసివేస్తూ అందుకు కారణం చెప్ప నిరాకరించుటచే 10 మంది సభ్యులు సభనుండి లేచిపోయారు. మిగతా, 7 గురు సభ్యులతో సభ సాగింది. (స్వ. వి)

# చిత్తూరు పురపాలక సంఘ సమావేశం

## వాయిదాతీర్మానం గెలుపు

చిత్తూరు నవంబరు 26: చిత్తూరు పురపాలక సంఘ సమావేశం నిన్నటి రోజున సి. రఘుపతి సెట్టిగారి అధ్యక్షత క్రింద జరిగినది. అజెండాలో చిత్తూరును మద్రాసు రాష్ట్రపు తమిళనాడులో చేర్చాలని ఒక అంశమున్నది. ఈ విషయమును చర్చించటం అయుక్తమని అట్లా చేస్తే ఐక్యతకు భంగం కలగవచ్చునీ, కనుక ఈ దినము సభను వాయిదా వేయాలని విజయ సింహారెడ్డిగారు ఒక తీర్మానము ప్రతిపాదించారు. దానిని అబ్బాస్ బహదూర్ ఖాన్ సాహేబ్ గారు బలపరిచారు. ఈ తీర్మానములో అసభ్య భాష ఉపయోగింప బడిందని అధ్యక్షుడు దానిని త్రోసివేశారు. అదే తీర్మానమును సవరించి విజయ సింహారెడ్డిగారు తిరిగి ప్రతిపాదించగా, ఓటింగులో 11 మంది అనుకూలంగాను, 9 మంది ప్రతికూలంగాను, ఓటు చేశారు. అంతట సభ వాయిదా వేయబడింది. (స్వ. వి.)

# చోరీసొమ్ము స్వాధీనం

పొన్నూరు, నవంబరు 23: బాపట్లలో వంధమూడి శీతారామారావుగారి ఇంట్లో దొంగిలింపబడిన, షుమారు రు. 2000/- కిమ్మతుగల వెండి, బంగారం గత రాత్రి స్థానికపోలీసు సబిన్స్పెక్టరు రహూఫ్ సాహెబు, బాపట్ల సబిన్స్పెక్టరు మహమ్మద్ ఖాశింగార్లు, యిచ్చట పట్టుకుని స్వాధీనపరచుకున్నారు. ఈ సందర్భములో పొన్నూరు, మంగళగిరి వాస్తవ్యులైన ముగ్గురు యానాదులను అరెస్టు గావించారు.

నేరములు, బంగారపునగలు, ఒకమహమ్మదీయ స్త్రీద్వారా, ఒక కంసాలివద్ద కరగించి, ఒక చేకడ్డీగా తయారుచేయించినట్లున్నూ, ఆకడ్డీని, నవర్సు రు. 60/- వంతున, ఒకబంగారు వర్తకుడు కొన్నట్లున్నూ పోలీసు విచారణలో తెలిసినది.

## అనుమానాస్పదుల అరెస్టు

స్థానిక పోలీసుస్టేషను, సబ్ జైలువద్ద తారట్లాడుచూ, అనుమానాస్పదులైన, పసుపులేటి సుబ్బారావు (నెల్లూరుజిల్లా), మస్తాన్ (నిడుబ్రోలు) అనువారలను, 20 వ తేదీన, స్థానికపోలీసు యిన్స్పెక్టరు కె. చంద్రమౌళిగారు, క్రిమినల్ ప్రొసీజరు కోడు 151వ సెక్షను క్రింద, అరెస్టు గావించారు.

## అక్రమధాన్య రవాణా

ఈ ప్రాంతములనుంచి అక్రమ రవాణా అగుచున్న 10 బస్తాల ధాన్యమును, పచ్చలతాడిపర్రులో, గ్రామకర్ణం, 21 వ తేదీ రాత్రి, పట్టుకున్నట్లు తెలియుచున్నది.

# కర్నూలు జిల్లాలో బియ్యం కొరత

## తక్షణ సరఫరాలకు ప్రభుత్వానికి కబురు

### పది రోజు లకుకూడా సరిపోని బియ్యం నిల్వలు

కర్నూలు, నవంబరు 28: కర్నూలు జిల్లాలో స్టాట్యుటరీ (చట్టబద్ధమైన) రేషనింగుకు భంగంకలిగే పరిస్థితి ఏర్పడిందనీ, పదిరోజులకు సరిపడే ఆహారనిలవలు కూడా లేనందున తక్షణమే బియ్యం సరఫరా చేయవలసిందని ప్రభుత్వానికి వర్తమానం పంపించామనీ జిల్లా సప్లయి అధికారి ఆదికేశవులు నాయుడుగారు నిన్న జరిగినజిల్లా ఆహారసంఘసభలో తెలియజేశారు.

అక్టోబరు, నవంబరు నెలల కోటాకొ 2 వేల టన్నుల బియ్యమును బెజవాడ నుండి తెప్పించుకోవలసి ఉందనీ, కాని అక్కడి తుఫానునష్టం కారణగా బియ్యం ఇక్కడికి సరఫరా చేయబడలేదనీ, ఈ కోటాను తెనాలి నుండి పంపించటానికి ఇప్పుడు ఏర్పాట్లు జరిగాయనీ, అయితే ఇప్పటికి తెనాలినుంచి అసలు కోటాలో 5 వ వంతు మాత్రమే చేరిందని ఆయన తెలిపారు.

"స్టాట్యుటరీ రేషనింగు ఈజిల్లాలో అతి ప్రయాసమీద నడపబడుతున్నది అందుచేత ముఖ్యంగా గ్రామప్రాంతాలలో బియ్యంకొరత చాల ఎక్కువగా ఉన్నది. కాని జొన్నల పరిస్థితిమాత్రం మెరుగుగా ఉన్నది గ్రామాలలో రేషన్ కొట్లలో దొరికే ధరకంటే తక్కువధరకే జొన్నలు అమ్మబడుతున్నవి. జిల్లాలో గోధుమ నిల్వలు చాలమటుకు ఎవ్వరూ కొనకపోవటంచేత చెడిపోతున్నవి. ఈ చెడిపోయిన గోధుమలను మనిషికి అరబస్తావరకు అమ్మవచ్చునని మేము ఆజ్ఞలు జారీచేశాము. ప్రస్తుత దాళవా పంటలో మనం తీవ్రతరంగా ధాన్యసేకరణ చేయవలసివున్నది. ఎందువల్లనంటే విదేశాలనుండి ముందుముందు ఆహారధాన్య దిగుమతులు తగ్గిపోనున్నవి. పైగా తుఫానుదెబ్బతిన్న పగ్గారు జిల్లాలనుండికూడా దిగుమతి అయ్యే అవకాశంలేదు. ధాన్యసేకరణలో అనధికారులందరూ విరివిగా తోడ్పడవలెనని విజ్ఞప్తి చేస్తున్నాను. ఇటీవలి అధికవర్షాలమూలంగా చెరువుల్లో బాగా నీరునిండినందున రైతులు రెండో పంటను వేయవలసిందని కూడా కోరుతున్నాను." అని ఆయన ఉపన్యసించారు.

# కన్నడుల సత్యాగ్రహ వార్త

## సరియైనదేనని బళ్ళారిసభా ఉపన్యాసకుల ప్రకటన

బళ్ళారి, నవంబరు 26: బళ్ళారిలో ఈనెల 20 వ తేదీన జరిగినబహిరంగ సభలో మాట్లాడిన ముఖ్యవ్యక్తులు బి. ఎమ్. మరులసిద్దయ్య, రేవనసిద్దయ్య, యజమాన్ సంత రుద్రప్ప, టి. సంతప్ప గార్లు ఈ క్రిందిప్రకటన చేస్తున్నారు.

"22 వ తేదీన దినపత్రికలన్నిటిలోను ప్రకటింపబడిన వార్తయేసరియైనది. దీనిని బళ్ళారి సర్కిల్ కాంగ్రెస్కమిటీ అధ్యక్షుడు డి. హెచ్. వెంకోబరావుగారు తరువాత కలిగిన ఆలోచనమీద, ఖండిస్తూ ప్రకటన చెయ్యటం ఆశ్చర్యకరంగావుంది. బళ్ళారిని బలాత్కారంగా ఆంధ్రరాష్ట్రంలో చేర్చినట్లయితే సత్యాగ్రహం జరిపి ఎదిరించాలని మేమంతా మాట్లాడాము.. కాంగ్రెసును విమర్శించాముకూడ. కాని వెంకోబరావుగారు తన ఉపన్యాసంలో మమ్మల్ని మించిపోయారు. కాంగ్రెసును, మద్రాసు మంత్రివర్గాన్ని, డా॥ పట్టాభిని ఆయన తీవ్రంగా నిరసించారు. ఈ జిల్లాలో ఆంధ్రపరిపాలన అసాధ్యమయ్యేటుగా చేయడానికి కన్నడిగలు కాంగ్రెసునుండి రాజీనామా యిచ్చి, సత్యాగ్రహం చెయ్యటానికి సిద్ధపడాలనీ, కన్నడుల హక్కులకోసం వారు వేల సంఖ్యలో చనిపోవటానికైనా వెనుదియ్యరాదనీ, ఆయన అన్నారు.

బహిరంగసభకువచ్చిన మద్రాసు దినపత్రికల విలేఖరులు సభా తీర్మానాలను వ్రాసుకొని వెంటనే సభ విడిచిపోయారు. పి. టి. ఐ. విలేఖరి ఒక్కడే చివరివరకూ ఉన్నాడు. అతడు పంపినవార్త ముందుగా ప్రకటింపబడిన పిమ్మట, మిగతా పత్రికా విలేఖరులువచ్చి ఆ వార్తను ఖండించవలసిందిగా మమ్మడిగారు. కాని అది సరియైనదే అయినందున మేము ఖండించలేదు. వెంకోబారావుగారు రావిధంగా ఎందుకు ఖండించారో, వారి ఉద్దేశ్య మేమిటో స్పష్టంగానే తెలుస్తున్నది."

# విద్యాబోధన శాఖ క్రొత్త అధ్యక్షుడు

వాల్తేరు, నవంబర్ 26: రాజమండ్రి, ప్రభుత్వ ట్రెయినింగు కళాశాల ప్రిన్సిపాలు శ్రీ కె. సత్యనారాయణ. (ఎమ్. ఎ ఎల్. టి.) గారు 'ఫాకల్టీ ఆఫ్ టీచింగ్'కు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు.

24-11-49 నుండి 3 సంవత్సరాల వరకూ ఆయన ఈ పదవిలో వుంటారు.

# తాలూకా, పట్టణ కాంగ్రెసుల ఎన్నికలు

## వాయిదావేస్తూ రాష్ట్ర కాంగ్రెస్ సంఘ ప్రకటన

విజయవాడ, నవంబరు 27: ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి కె. ఓబులరెడ్డిగారు ఈ క్రింది ప్రకటన చేస్తున్నారు.

"వచ్చే రెండు నెలలవరకూ కాంగ్రెసు సభ్యత్వ కార్యక్రమంలో దాదాపు కాంగ్రెసు వాదులందరూ నిమగ్నులై వుంటారు. కనుక కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి కళా వెంకట్రావు గారితో సంప్రదించినమీదట, ఆంధ్రదేశంలోని తాలూకా, పట్టణ కాంగ్రెస్ కమిటీలన్నిటి ఎన్నికలూ తిరిగి తెలియపరిచేవరకూ వాయిదా వేయాలని నిర్ణయింపబడింది. క్రొత్త ఎన్నికలు జరిగేవరకు ప్రస్తుతం పనిచేస్తున్న తాలూకా కాంగ్రెసు కమిటీలు సక్రమమైనవే నని పరిగణించవలసిందిగా జిల్లా కాంగ్రెసు లన్నిటికీ ఆదేశించబడినది. తాలూకా, పట్టణ కాంగ్రెసు సంఘాలు ప్రస్తుతం లేనిచోట, లేక వీటి అధ్యక్షులు, కార్యదర్శులు రాజీనామా యిచ్చినచోట, లేక ఆ పదవులు ఖాళీగావున్న చోట జిల్లా కాంగ్రెసు సంఘాలు తగిన వ్యక్తుల పేర్లు సూచించినచో వారిని తాత్కాలికంగా ప్రత్యేకాధికారులుగా రాష్ట్ర కాంగ్రెసు సంఘం నియమిస్తుంది."

# కాంగ్రెసు ఓటర్ల జాబితాల తయారీ

## రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి వివరణ

విజయవాడ, నవంబర్ 26: అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గపు ఆదేశానుసారము, కాంగ్రెసు ఓటర్ల జాబితాలను క్రొత్త పద్ధతిలో తయారుచేయు విషయమై, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి యీ దిగువ ప్రకటనచేసిరి. మామూలుగా తయారుచేయబడుచున్న జాబితాలకు బదులు, ప్రాథమిక సభ్యత్వపు ఫారములనన్నింటిని వరుస సంఖ్యలలో కూర్చవలెను. గ్రామపంచాయతీ ఎన్నికలు వచ్చినప్పుడు, ఎన్నికోద్యోగివచ్చి, ఆ ఫారముల పై సంతకములను పెట్టిన సభ్యులను పిలచి, కార్యక్రమమును సాగించును. గ్రామ పంచాయితీల ఎన్నికలు 'చేతులెత్తుట' ద్వారా జరుపబడును. కొన సభ్యులను చేర్పించువారు, ఆఫారములపై వరుస సంఖ్యలంవేసి, తమ సంతకములను వాటిపై చేసి, ప్రత్యేక ప్రాథమిక పంచాయితీ సంఘములకుగాని, కాంగ్రెసు సంఘములకుగాని, నవంబర్ 30 తే లోపల వాటిని అందజేసి రసీదులను పొందవలెను. ఈ సంఘములు తిరిగి యీ ఫారములను తాలూకాసంఘములకుగాని, పట్టణసంఘములకు గాని డిశంబర్ 3 తే లోగా అందజేయవలెను. తాలూకా, పట్టణ సంఘములు రాష్ట్ర కాంగ్రెసుకు డిశంబర్ 7 లోగా, ప్రాథమిక సభ్యుల సంఖ్యను తంతిద్వారా ప్రత్యేక జాబుద్వారా తెలియజేయవలెను. తాలూకా, పట్టణ, కాంగ్రెసు సంఘములు, సభ్యత్వపు ఫారములను జాగ్రత్తచేయగలవు. ప్రాథమిక సభ్యుల జాబితాల నెవ్వరునూ మార్చకుండగా యుండుటకై యీ జాగ్రత్తలను తీసికొనవలసివచ్చినదని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి తెలియజేయుచున్నారు. స్వ. వి.

# పారిశ్రామిక చలనచిత్ర ప్రదర్శనం

విజయవాడ, నవంబరు 28: నేటి ఉదయము విజయవాడ సోషల్ క్లబ్లో స్టాండర్డు వాక్యూం ఆయిల్ కంపెనీవారి "శాంతి మోబిలాయిల్" అను చిత్రము ప్రదర్శింపబడెను. అనేకులు ప్రభుత్వోద్యోగులు, ఇంజనీర్లు, రవాణాశాఖలో పని చేయుచున్నవారు చిత్రమును చూచిరి. ఈ సందర్భములో బి. శేషగిరిరావుగారు ఆహ్వానించిరి నొసగిరి.

అతిథులకు బి. మంగేశ్వరరావుగారు వందనము లర్పించిరి. స్వ. వి.

# పాకాల కమ్యూనిస్టుకు 18 నెలలు ఖైదు

తిరుపతి నవంబరు 25: పాకాలగ్రామానికి చెందిన పి. నాగులు అనేకమ్యానిస్టును చంద్రగిరి సబ్-డివిజనల్ మాజిస్ట్రేటు కె. వి. శివసుబ్రహ్మణ్యన్ గారు 18 నెలలు కఠిన ఖైదును, 200 రూ. ల జుల్మానాను, అదకట్టనిచో మరి రెండు నెలల ఖైదును విధించారు. ఇతను కొన్ని విద్రోహకర ఉపన్యాసాలిచ్చాడని నేరమారోపింప బడింది.







Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.